# చందమామ కేమెల్ రంగుల పోటీ

ప్రవేశ రుసుము లేదు





**బహుమతులు గెలుచుకోండి**

కేమెల్—మొదటి బహుమతి రు. 15
కేమెల్—2వ బహుమతి రు. 10
కేమెల్—3వ బహుమతి రు. 5
కేమెల్—5 కన్సొలేషన్ బహుమతులు
కేమెల్—10 సర్టిఫికెట్లు



12 సంవత్సరముల లోపల వయస్సు గల్గిన విద్యార్థులు మాత్రమే పాల్గొన గలరు. పై చిత్రాన్ని ఏ కేమెల్ రంగుతోనైనా రంగు వేయుండి. రంగు వేసిన ప్రవేశ పత్రాలను ఈ క్రింది అడ్రసుకు పంపండి.

P.B. No. 9928, COLABA, Bombay-400 005.

ఫలితములు తుది నిశ్చయముగాన, ఉత్తర ప్రత్యుత్తరములు అనుమతించబడవు.

Name ______________________ Age __________

Address ______________________________

దయచేసి మీ పేరు, చిరునామా, ఇంగ్లీషులోనే వ్రాయండి.

VISION

బొమ్మను పూర్తిగా రంగులు వేయాలన్నది గుర్తుంచుకోండి.

ఎంట్రీలు పంపుటకు ఆఖరు తేదీ. 31-3-1980

**CONTEST NO. 13**

మొక్కలు పెట్టిన గీత వెంట కత్తిరించవలెను.

**Results of Chandamama—Camlin Colouring Contest No. 12 (Telugu)**

*1st Prize:* K. Jaya Ram, Vizianagaram. *2nd Prize:* B. Ramesh Babu, Visakhapatnam. *3rd Prize:* M. Madhav, Kakinada. *Consolation Prizes:* Y. S. Sankar, Hyderabad. V. Srinivas Rao, Berhampur. N. Prakash Rao, Koraput. S. K. Visweswararao, Mandapeta. A. Vani Vijayalakshmi, Secunderabad.




# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళ కథ [''రాక్షసభీతి - రాజనీతి''] ఎస్. వాహిద్ రచన. ఆటవికదశలో ఏ జాతి పరిపాలన ఆ జాతివాళ్ళు ఎన్నుకున్న నాయకుడి చేతిలో ఉండేది. కాని రాజరికం వచ్చినాక, రాజ్యంలో అనేక జాతుల వారికి స్థానం లభించింది. అన్ని జాతులనూ సమంగా చూడటం రాజనీతి.

## అమరవాణి

ఇహ యత్ క్రియతే తత్తు పరత్రైవోపభుజ్యతే :
సిక్త మూలస్య వృక్షస్య ఫలం శాఖాసు దృశ్యతే.

[ఒకచోట మంచి జరిగితే, ఫలం మరొకచోట కనబడుతుంది; చెట్టు పాదుకు నీళ్ళు పోస్తే, కొమ్మలలో కాయలు కాసినట్టు!]

సంపుటి 66 మార్చి '80 సంచిక 3

విడి ప్రతి : 1-50 : : సంవత్సర చందా : 18-00




ఎస్. వేణుగోపాల్, మచిలీపట్నం.

ప్ర: భౌమ్యాకర్షణ క్షేత్రం దాటిన వస్తువు అంతరిక్షంలోనే ఉండిపోతుంది అంటారు గద, మరి స్కైలాబ్ తిరిగి ఈ ఆకర్షణ పరిధిలోకి రావడానికి కారణం ?

న: భూమియొక్క ఆకర్షణ శక్తిని నిజంగా దాటిన వస్తువు చంద్రుడి ఆకర్షణకు గురి అవుతుంది. అప్పుడది చంద్రుడి ఆకర్షణ ఫలితంగా పొందే వేగాన్నిబట్టి చంద్రుడి చుట్టూ తిరుగుతూ ఉండిపోవటమో, వేగం మరీ హెచ్చుగా ఉంటే సూర్యుడి ఆకర్షణకు గురికావటమో జరుగుతుంది.

ఏ వస్తువుగాని భూమియొక్క ఆకర్షణ పరిధిని దాటాలంటే అది భూమినుంచి అనేక వేల మైళ్ళ దూరం వెళ్ళిపోవాలి. స్కైలాబ్ భూమి ఆకర్షణ పరిధిలో ఉండినదే. అయితే దాని వేగం భూమియొక్క ఆకర్షణను రద్దు చేసేదిగా ఉన్న కారణంచేత అది భూమి చుట్టూ తిరుగుతూ ఉండిపోయింది. అలాగే ఉండిపోక అది తిరిగి భూమి మీదికి రావటం ఆరంభం అయిందంటే దాని వేగం క్షీణించిందన్నమాట. వేగాన్ని కోల్పోవటానికి, అది తిరిగే కక్ష్యలో గాలి పలచగానే అయినా ఉండటం కావచ్చు.

నరెడ్ల సత్యనారాయణ, గుంటూరు.

ప్ర: డార్విన్ పరిణామ సిద్ధాంతం ప్రకారం కోతినుండి మానవుడు వుద్భవించాడని తెలుసుకున్నాం. అయినా కోతి జాతి ఇప్పటికీ వున్నది కదా? ఒకప్పుడు రాక్షస జాతి వున్నదని వుంది. ఆ రాక్షసజాతి కొంతైనా వుండి వుండాలి కదా?

న: మనిషి కోతి నుంచి పుట్టాడన్నది అమ్మమ్మల అభిప్రాయం. ఒకానొక మూల జాతి నుంచి కోతులూ, వానరాలూ, మనుషులూ విడివిడిగా పరిణామం చెందటం జరిగింది. ఆ మూలజాతిలో కొన్ని వానరలక్షణాలూ, కొన్ని మానవలక్షణాలూ ఉండేవనీ, ఆయా లక్షణాలను వృద్ధి చేసుకున్నవి కోతులుగానూ, వానరాలుగానూ, నరవానరాలుగానూ విభజన పొందాయనీ శాస్త్రజ్ఞులు చెబుతున్నారు. (వానరాలంటే apes; వాటికి తోకలుండవు, వెనక కాళ్ళమీద నిలబడి నడవగలవు. ముందు కాళ్ళను చేతులుగా ఉపయోగించగలవు.)

రాక్షసులు మానవుల పరిణామదశలో ఒకటి అయితే వాళ్ళు అంతరించటంలో వింత లేదు. పరిణామంగాని కోతి, వానరజాతులు అంతరించినట్టే!




## 81

భూతం కథ విని రాజు బ్రాహ్మణులను పిలిపించి, "అయ్యలారా, నాకు మూడు స్తనాలుగల బాలిక జన్మించింది. ఇందువల్ల కలిగే అశుభం నుంచి తప్పించుకోవటానికి ఏంచెయ్యాలి?" అని అడిగాడు.

"రాజా, అంగలోపంగాని, అధికాంగాలు గాని గల స్త్రీ నీతివిహీనురాలై, భర్త మరణానికి కారకురాలవుతుంది. మూడు స్తనాలు గల కుమార్తెను తండ్రి చూసిన మరుక్షణం చనిపోతాడు. ఆమె మీ కంట పడకుండా ప్రత్యేక భవనంలో పెరగనియ్యండి. ఆమెకు యుక్తవయసు రాగానే, పెళ్ళాడ గోరినవాడికిచ్చి పెళ్ళి చేసి, ఇద్దరినీ దేశం నుంచి వెళ్ళగొట్టండి. అలా చేసినట్టయితే తమకు ఇహంలో అపయశమూ, పరంలో పాపమూ తప్పుతాయి," అన్నారు బ్రాహ్మణులు.

రాజు వారు చెప్పిన ప్రకారమే చేసి, "రాజుగారికి పుట్టిన మూడు స్తనాల కుమార్తెను ఎవరు పెళ్ళాడితే వారికి లక్ష బంగారు మాడలిచ్చి, భార్యాభర్తలను దేశం నుంచి బహిష్కరించటం జరుగుతుంది," అని దండోరా వేయించాడు.

ఈ దండోరా విని ఎవరూ రాజకుమార్తెను పెళ్ళాడతామని ముందుకు రాలేదు. అనేక సంవత్సరాలు గడిచాయి. ఆమెను పెళ్ళాడితే చావు తప్పదని అందరికీ భయమే. అందుచేత గర్భదరిద్రులు కూడా ఆమెను పెళ్ళాడ సాహసించలేదు. రాజకుమార్తె ఈడేరి, చక్కని సౌందర్యవతిగా తయారయింది. రోజూ నగరంలో దండోరా వేస్తూనే ఉన్నారు.

ఒకనాడు నగరానికి ఒక గుడ్డివాడు ముష్టిఎత్తుకునేటందుకు వచ్చాడు. వాణ్ణి




నడిపించటానికి, వాడి గ్రామానికి చెందిన వాడే ఒక గూనివాడు కూడా అతడి వెంట వచ్చాడు.

ఈ చాటింపు విని గుడ్డివాడు గూని వాడితో, ''నన్ను ఆ చాటింపువేసే వాడి వద్దకు తీసుకుపో. నేను వాడి తప్పెట తాకి, నా సమ్మతి తెలుపుతాను. నా భార్య చెడ్డదైతే ఏంగాక, లక్ష బంగారు కాసులు సంపాదించుకుంటాను. హాయిగా బతకవచ్చు! తరవాత చచ్చిపోయినా ఫర్వాలేదు. నా వంటి గర్భదరిద్రుడికి చావు కూడా విమోచనమే. కాకపోతే కొంత కాలంపాటు సుఖాలలో ఓలలాడవచ్చు.'' అన్నాడు.

మంథరకుడు అనే పేరుగల గూని వాడు, గుడ్డివాణ్ణి చాటింపు వేసేవాడి వద్దకు తీసుకుపోయి, తప్పెట తాకించాడు.

గుడ్డివాడు చాటింపు వేయిస్తున్న అధికారితో, ''రాజుగారు నాకు తమ కుమార్తెను ఇయ్యటానికి సిద్ధంగా ఉన్నట్టయితే, ఆమెను పెళ్ళాడతాను,'' అన్నాడు.

గుడ్డివాణ్ణి రాజుగారి వద్దకు తీసుకుపోయి, వాడు రాజకుమార్తెను పెళ్ళాడటానికి ఇష్టపడుతున్నట్టు చెప్పారు.

''నా నియమానికి ఒప్పుకున్నవాడు ఎలాటివాడైతే నేం? గుడ్డివాడైనా, కుష్ఠు వాడైనా, అంటరాని వాడైనా, వాడు నా కూతుర్ని పెళ్ళాడి, దేశం విడిచిపోయే మాటైతే, వాడికి పిల్లతోబాటు లక్ష బంగారు కాసులు ఇస్తాను,'' అన్నాడు రాజు.

రాజాజ్ఞను పురస్కరించుకుని, రాజు గారి మనుషులు గుడ్డివాణ్ణి తీసుకుపోయి నదిలో స్నానం చేయించి, మేలివస్త్రాలు వాడికి కట్టబెట్టి, శాస్త్రోక్తంగా రాజకుమార్తె నిచ్చి, వివాహం జరిపించి, వాడిచేతిలో లక్ష బంగారుకాసులు పెట్టి, వాణ్ణీ, వాడి వధువునూ, పడవలో ఎక్కించి, యమునా నదిలో వదిలిపెట్టారు. వారితోపాటు గూని వాడు కూడా పడవ ఎక్కాడు. పడవవాడు వాళ్ళను దేశం దాటించి, తిరిగి వెళ్ళి పోయాడు.

వాళ్ళు ఒక పెద్ద నగరం చేరి, పెద్ద భవంతి మాట్లాడుకుని, అందులో వైభవంగా జీవించసాగారు. గుడ్డివాడు తినటమూ, నిద్రపోవటమూ తప్ప ఇంకేమీ చేసేవాడు కాడు. గూనివాడే ఇంటి పనులన్నీ చూసేవాడు.

త్వరలోనే రాజకుమార్తెకూ, గూని వాడికీ మధ్య సంబంధం ఏర్పడింది.

ఒకసారి ఆమె తన ప్రియుడితో, "ఈ గుడ్డివెధవను చంపేస్తే మనిద్దరమూ సుఖంగా ఉండవచ్చు. నువు ఘాటైన విషం తెస్తే నేను గుడ్డివాడి ఆహారంలో దాన్ని కలుపుతాను," అన్నది.

గూనివాడు విషం కోసం చూస్తూండగా వాడికి చచ్చిపోయిన మహానాగు కనిపించింది. వాడు దాన్ని ఇంటికి తీసుకుపోయి, రాజకుమార్తెతో, "దీన్ని ముక్కలుగా తరిగి, మసాలా దినుసులు బాగా దట్టించి, చేపలకూర లాగా ఉండేటట్టు వండి, గుడ్డివాడి చేత తినిపించు. వాడికి చేపలకూర అంటే అమిత ఇష్టం. అందు చేత వాడు దాన్ని తెగమెక్కి, చచ్చి ఊరుకుంటాడు," అని చెప్పి, పనిచూసుకోబోయాడు.

రాజకుమార్తె గూనివాడు చెప్పినట్టే పామును వండి, గుడ్డివాడి వద్దకు గరిటెతో వెళ్ళి, "ప్రియా, నీకు ఇష్టమని చేపల కూర వండాను. నేను వెళ్ళి నీళ్ళు తీసుకువస్తాను. ఈ లోపల ఈ గరిటెతో కూరను కలుపుతూ ఉండు," అన్నది.



గుడ్డివాడు సంతోషించి, పెదవులు నాకుక్కుంటూ, గరిటెతో పొయివద్దకు వెళ్లి, మధ్యమధ్య కూరను కలపసాగాడు. విషపునాగు నుంచి వెలువడే ఆవిరికి గుడ్డివాడి కంటికి చూపులేకుండా చేసిన పొరలు కాస్తా కరిగిపోయి, వాడికి చూపు వచ్చేసింది.

వాడు పొయి మీద ఉన్నది చేపలు కావనీ, కాలసర్పం ఖండాలనీ తెలుసుకుని, "ఇదేమిటి? ఆమె కాలనాగును వండుతూ చేపలు వండుతున్నానని నాతో ఎందుకు చెప్పింది? అంతా తెలుస్తూనే ఉన్నది! ఈ మూడు స్తనాల ఆడదానికి నీతి ఉండదు. అది గూనివాణ్ణో, మరొకణ్ణో మరిగి నన్ను చంపెయ్యటానికి ఈ ఎత్తు వేసింది. నేను నిజం తెలుసుకుని, దాని నేరం బయటపెట్టాలి," అనుకుని, తనకు కళ్ళురానట్టే నటిస్తూ, కూరను కలపసాగాడు.

తరవాత కొద్ది సేపటికి గూనివాడూ, రాజకుమార్తె కూడా ఇంటికి తిరిగి వచ్చారు. గుడ్డివాడు చూడలేడు గదా అని ఇద్దరూ స్వేచ్ఛగా సరసాలాడారు. ఇది చూసిన గుడ్డివాడు, అందుబాటులో ఆయుధం ఏదీ లేనికారణంచేత, తన సహజ ధోరణిలో తడువుకోసాగాడు. అది కూడా వాళ్లు పట్టించుకోలేదు.

గుడ్డివాడు అకస్మాత్తుగా గూనివాణ్ణి పట్టుకుని పైకెత్తి గిరగిరా తిప్పి రాజకుమార్తె వక్షంమీద బలంగా కొట్టి, ఇద్దరినీ ఒక్క దెబ్బతో చంపుదామనుకున్నాడు. కాని వాస్తవంగా జరిగినదేమంటే, రాజకుమార్తెకు అదనంగా ఉన్న స్తనం కాస్తా అణగారిపోయింది. గూనివాడి వీపు సరిఅయి, గూని కాస్తా పోయింది!

ఈ విధంగా విధి అనుకూలించిన కారణంగా, రాజకుమార్తే, గుడ్డివాడూ, గూనివాడూ చావటానికి జరిగిన ప్రయత్నాలు వారి లోపాలను సరిదిద్దటానికి మాత్రమే ఉపయోగపడి, అంతులేని మేలు చేశాయి.





# భల్లూక మాంత్రికుడు

## 21

[ కాళీవర్మ సారంగ మార్గాన పోయి, బైరాగుల నుంచి మంత్రదండాన్ని తీసుకున్నాడు. తరవాత అందరూ జితకేతరాజుగారి ఉద్యానవనంలో ప్రవేశించారు. ఆ సమయంలో అక్కడికి రాజూ, మాయామర్కటులు వచ్చారు. రాజు, బైరాగులను అక్కడికెందుకొచ్చారని ప్రశ్నించగా, గురుబైరాగి మంత్రదండం, సుబ్బిశెట్టి, అంటూ అరవసాగాడు. తరవాత—]

గురుబైరాగి చెప్పదలిచిందేమిటో అర్థం కాక రాజు జితకేతుడు కోపంగా, ''ఒరే, సన్యాసి వెధవా, నీ వాగుడేమిటి ? మంత్ర దండం ఎక్కడ? సుబ్బిశెట్టి ఎవరు ?'' అని అడిగాడు.

గురుబైరాగి కొంచెం స్థిమితపడి, ''మహా రాజా, బైరాగినైన నన్ను, సన్యాసి అని అవమానపరచకండి. బైరాగి వేరు, సన్యాసి వేరు.'' అన్నాడు.

రాజు ఆ జవాబుకు చిరాకుపడుతూ ఏదో అనబోయేంతలో, మాయామర్కటుడు కోపంగా పళ్ళు కొరికి, ''ఒరే, దొంగ బైరాగీ! అట్టే మాటలు పెంచక, సంగతేమిటో చెప్పు. నా నుంచి ఎవరో దొంగిలించిన మంత్రదండాన్ని నువ్వెక్కడైనా చూశావా? '' అని అడిగాడు.

గురుబైరాగి, మర్కటుడి కేసి ఆశ్చర్యంగా చూసి, తన శిష్యుల కేసి తల



తిప్పి, ''ఒరే, శిష్యోపశిష్యుల్లారా! ఇత గాడేనా కొత్తగా చంద్రశిలా నగరానికి అమాత్యుడైన మర్కటుడు?'' అన్నాడు.

''అవును గుర్రో, అవును! ఈయనే మర్కటామాత్యుడు!'' అన్నారు శిష్య బైరాగు లిద్దరూ.

మాయామర్కటుడు బైరాగిని కత్తితో కొట్టబోయిన వాడల్లా తమాయించుకుని, తోకతో ఛెళ్ళుమంటూ అతడి నడుం మీద కొట్టి, ''ఒరే, వెంటనే నువు చూసిందేదో చెప్పకపోయావో, యీసారి కత్తితో నీ తల నరికేస్తాను,'' అన్నాడు.

మర్కటుడి తోక దెబ్బకు గురుబైరాగి కింద పడిలేచి, ఒళ్ళు దులుపుకుంటూ తన శిష్యులకేసి చూశాడు. పెద్ద శిష్యుడు విచారంగా ముఖంపెట్టి, ''గురో, నిజం చెప్పెయ్యండి, మనకు బహుమానం కూడా వస్తుంది. నగర ఉత్తరపుద్వారం దగ్గిరున్న ధర్మసత్రం ఎదటి, మూడం తస్తుల భవంతి యజమాని సుబ్బిశెట్టి దగ్గిర గదా, మనం ఆ మంత్రదండాన్ని చూసింది,'' అన్నాడు.

గురుబైరాగి గొంతు సవిరించుకుని మాట్లాడ బోతున్నంతలో మాయామర్కటుడు కిచ కిచ మంటూ నవ్వి, ''ఒరే, మతిమాలిన వెధవా, యింకా మీ గురువు చెప్పే దేమిటి, సంగతంతా నువే చెప్పావు గదా? ఓయి రాజా! వెంటనే భటులను ఆ శెట్టి ఇంటికి పంపి, ఆ మంత్రదండాన్ని తెప్పించు,'' అన్నాడు.

ఈసారి రాజు గట్టిగా చప్పట్లు చరచ గానే భటుడొకడు అక్కడికి పరిగెత్తు కుంటూ వచ్చాడు. రాజు వాడికి బైరాగులను చూపుతూ, ''ఒరే, వీళ్ళవెంట మరికొందరు భటులతో పోయి, మన నగరం వాడైన సుబ్బిశెట్టితోపాటు మంత్ర దండాన్ని కూడా యిక్కడకు వున్నట్టు లాక్కురండి,'' అన్నాడు.

భటులు, బైరాగులను అదిలించి అక్కడి నుంచి తీసుకుపోతున్నంతలో, ఈసారి కోటగోడల అవతలి నుంచి

శంఖనాదం చెవులు దిబ్బళ్ళుపడేలా విని పించింది. వెంటనే మాయామర్కటుడు ఒక గెంతు గెంతి జితకేత రాజుతో, "ఆహా, రాజా! ఆ శంఖనాదం చేసే మహానుభావుడు నా గురువైన మిథ్యా మిశ్రుడు! ఆయన మన శత్రువులైన భల్లూక మాంత్రికుడితోపాటు, రాజుదుర్ముఖుణ్ణీ, కాళీవర్మ, ఉగ్రదండ రాక్షసులనూ హత మార్చుతాడు. నువు క్షణాలమీద చక్ర వర్తివి కాబోతున్నావు," అంటూ కోట గోడ కేసి బయలుదేరాడు.



రాజు జితకేతుడు మర్కటుడి భుజం పట్టుకు ఆపి, "నా సైనికులూ, సామంతు సూర్యభూపతీ; ఆ ఉగ్రదండ రాక్షసుడూ, భల్లూక మాంత్రికుల నుంచి కోటను ఎంతసేపు కాపాడగలరు! నువు కూడా వెంట లేకపోతే నాకు సలహాయివ్వగల వాళ్లు ఎవరూ లేరుగదా? మంత్రి జీవగుప్తుణ్ణి అవమానించి పంపటం పొరబాటుగా తోస్తున్నది," అన్నాడు.

"రాజా, నీ కొచ్చిన ప్రాణభయం ఏమీ లేదు, చింతించకు," అంటూ మాయా మర్కటుడు, కోట గోడ మీదికి పరిగెత్తాడు.

పూలపొదల చాటున దాగివుండి, అప్పటివరకూ అంతా గమనిస్తున్న కాళీ వర్మ, యిదే మంచి అదను అనుకుంటూ రాజు కేసి బయలుదేరబోతున్నంతలో అక్కడికి సామంతు సూర్యభూపతి ఆయాసపడుతూ పరుగు పరుగున వచ్చి, "మహారాజా, నేనిప్పుడే బయలుదేరి, నా సొంత కోటకు పోతున్నాను. ఒక రాక్ష సుడూ, శంఖం ఊదుతూ తన శిష్యుడితో వచ్చిన, ఒక మాంత్రికుడూ, కోట ద్వారాలు పగలకొట్టి లోపల ప్రవేశించా లని చూస్తున్నారట! లోపల నా భార్యా, కుమార్తే, కొద్దిమంది సేవకులూ తప్ప, మరెవరూలేరు," అన్నాడు.

రాజు జితకేతుడు ఆశ్చర్యపోతూ, "ఇదంతా ఏదో గందరగోళంగా వున్నదే! ఒక రాక్షసుడూ, మాంత్రికుడైన భల్లూ కుడూ నా కోట మీద దాడికి వచ్చారు.



మరొక మాంత్రికుడూ, రాక్షసుడూ ఏమిటి?" అన్నాడు.

ఆ ప్రశ్నకు ఏమని జవాబివ్వాలో తోచక సామంతు సూర్యభూపతి దిక్కులు చూస్తూండగా, పూలపొదల చాటునుంచి కాళీవర్మ బయటికి వస్తూ, "మహారాజా, ఈ క్షణంలో నేను మీకు శత్రువును కాదు. కత్తి దూయకండి. మీరెంత నిస్సహాయ స్థితిలో వున్నారో, మీకన్న నా కెక్కువ తెలుసు. మీ మాయామర్కటుడు కోట గోడ దూకి బయటికి పోవటం, తమరు గమనించినట్టు లేదు," అన్నాడు.

రాజు జితకేతుడు ఒక క్షణకాలం నివ్వెరపోయి, "నీవు కాళీవర్మవు కాదా? లోగడ నీకేగదా నేను శిరశ్ఛేద శిక్ష విధించింది?" అన్నాడు.

ఆ ప్రశ్నకు కాళీవర్మ చిన్నగా నవ్వి, "అది ఏనాటి మాట! అప్పుడు మీరు రాజునన్న అహంలో వున్నారు. ఇప్పుడు తీరని చిక్కుల్లో తల మునకలై కొట్టుమిట్టాడుతున్నారు," అన్నాడు.

రాజు జితకేతుడు, సామంతు సూర్యభూపతి కేసి అనుమానంగా చూస్తూ, "కాళీవర్మా! యీ సూర్యభూపతి మరెవరో రాక్షసుడూ, మాంత్రికుడూ అంటూ చెపుతున్నాడు. ఈ గందరగోళమంతా ఏమిటి? ఇద్దరు మాంత్రికులూ, యిద్దరు రాక్షసులూ?" అన్నాడు.

"మహారాజా, ఈ గొడవలన్నిటికీ కారణం యిద్దరు మాంత్రికుల మధ్య చెలరేగిన పగా, వైరం. వాళ్ళు బ్రహ్మపుత్రానది జన్మస్థానానికి దాపులనున్న, ఒక పురాతన ఆలయంలోని భల్లూకేశ్వరికి భక్తులు. ఒకడి పేరు భల్లూకపాదుడు. వాడి శిష్యుడైన భల్లూక మాంత్రికుడే మన ప్రాంతాలకు వచ్చినవాడు. రెండవవాడు మిథ్యామిశ్రు డనే తాంత్రికుడు. వాడి శిష్యుడే తమ మాయామర్కటుడు. ఇక రాక్షసు లిద్దరూ అన్నదమ్ములు. ఉగ్రదండు డనేవాడు మాతో వున్నాడు. వాడి అన్న అయిన కాలదండుణ్ణి,

ఆ తాంత్రికి మిథ్యామిశ్రుడు బందీగా పట్టుకున్నాడు. అదీ సంగతి!'' అన్నాడు కాళీవర్మ.

కాళీవర్మ మాట ముగించే లోపలే సామంతు సూర్యభూపతి, ''మహారాజా, ఆ తాంత్రికుడే తన బందీ అయిన రాక్షసుణ్ణి వెంటబెట్టుకుని, నా కోట మీద దాడికి వచ్చివుంటాడు. సెలవు, మళ్ళీ తమ దర్శనం చేసుకుంటాను,'' అంటూ అక్కణ్ణించి వేగంగా వెళ్ళిపోయాడు.

రాజు జితకేతుడు దిగాలుపడిపోతూ, కాళీవర్మతో, ''కాళీవర్మా! ఇప్పుడు నువ్వేం చేయబోతున్నావు? ఓహో, ఒక చేతిలో మంత్రదండం వున్నది; రెండవ చేత్తో ఒర నుంచి కత్తి దూయగలవు! నేను రాజ్యపాలన విషయాల్లో అసమర్థుణ్ణేమోకాని, కత్తియుద్ధంలాంటి విద్యల్లో అసమర్థుణ్ణీకాదు, పిరికివాణ్ణీ కాదు. ఇంతకూ నువ్వు నామీద దేన్ని ప్రయోగించబోతున్నావు?'' అన్నాడు.

కాళీవర్మ మంత్రదండాన్నీ, ఒర నుంచి కత్తినిలాగి దాన్నీ, కిందపడవేస్తూ, ''మహారాజా, నేను యీ రెండింటిలో దేన్నీ తమ మీద ప్రయోగించబోవటం లేదు. మీ పాలనలో జరిగిన అన్యాయాలకు బాధ్యత మీరూ, మీకు సలహాలిచ్చిన మంత్రులూ సమంగా పంచుకోవలసి



వుంటుంది. అయినా యిప్పటి పరిస్థితుల్లో రాజ్యాన్ని మాంత్రికుల నుంచీ, రాక్షసుల నుంచీ కాపాడవలసిన బాధ్యత నా మీద కూడా వున్నది,'' అన్నాడు.

రాజు జితకేతుడు ఆ మాటలకు చాలా సంతోషించి, కింద పడివున్న కాళీవర్మ కత్తిని స్వయంగా చేతికి తీసుకుని, కాళీవర్మకు యివ్వబోతున్నంతలో దాపుల నున్న సొరంగ మార్గం నుంచి ముందు రాజు దుర్ముఖుడూ, వెనకగా భల్లూక మాంత్రికుడూ పైకి వచ్చారు.

దుర్ముఖుడు భీకరంగా ఒక కేక పెట్టి, ఒరనుంచి కత్తి దూసి, ''కాళీవర్మా, నీకేమైనా హాని జరిగి వుంటుందేమో అను



ఉన్నాము. సరే, యీ రాజు జితకేతుణ్ణి యింకా ప్రాణాలతో వుండనిచ్చావేం? ఇదుగో, నా కత్తికి బలిచేయబోతున్నాను,'' అంటూ జితకేతుడి కేసి దూకాడు.

కాళీవర్మ చప్పున దుర్ముఖుడి కత్తికి తన కత్తిని అడ్డుపెట్టి, ''రాజా దుర్ముఖా! తొందరపడకు. ఈ జితకేత రాజుగారి వంశానికి సేవచేస్తూ, యుద్ధంలో నా తండ్రి మరణించాడు. ఆ సంగతి మరిచి, యిప్పుడీ మహారాజును చంపటం పాప కారణం అవుతుంది,'' అన్నాడు.

దుర్ముఖుడు కోపంగా ఏదో అన బోయేంతలో భల్లూక మాంత్రికుడు చప్పున వంగి కిందపడివున్న మంత్ర దండాన్ని చేతికి తీసుకుంటూ, ''కాళీ వర్మా, బాగా చెప్పావు. నా గురువైన భల్లూకపాదుడి ప్రబల విరోధి తాంత్రిక మిథ్యామిశ్రుడు రాక్షసుడు కాలదండుణ్ణీ, తన సేవకుడైన జంబుకేశ్వరుణ్ణీ వెంట పెట్టుకుని, యీ ప్రాంతాలకు వచ్చాడు. అంటే, వాడేదో నా గురువుకు హాని కలిగించే వచ్చి వుంటాడని నా అను మానం. మనం వెంటనే భల్లూక పాద పర్వతాలకు వెళ్ళాలి,'' అన్నాడు.

''మనం అటు వెళితే, యిక్కడ ఆ తాంత్రికుడి అగడాలు ఆపటం ఎట్లా? వాడు సామంతు సూర్యభూపతి కోటమీద దాడికి వెళ్ళినట్టు తెలిసింది. ఆ కోటలో పెద్ద సైన్యం అంటూ ఏమీలేదు,'' అన్నాడు కాళీవర్మ.

భల్లూక మాంత్రికుడు విసుక్కుంటూ, ''ఆ సంగతులన్నీ సారంగ మార్గంలో ప్రవేశించే ముందు, తన కోట కేసి పోతున్న సూర్యభూపతి చెప్పగా విన్నాను. మనం యీ రాజులా, సామంతులా గొడవల్లో ఎందుకు తల దూర్చాలి?'' అన్నాడు.

కాళీవర్మ కోపంగా మాంత్రికుడి కేసి చూస్తూ, ''ఈ రాజ్యంలో పుట్టి పెరిగిన వాణ్ణి, ముందు యీ రాజ్యం, దాని పాలకుల క్షేమం చూడకుండా, ఎక్కడో కొండల్లోవున్న ఒంటరి మాంత్రికుల సహా

యానికి పోవటం, ఏమాత్రం ధర్మం అనిపించుకోదు,'' అన్నాడు.

ఆ జవాబుకు భల్లూక మాంత్రికుడు వెలవెలపోతూ, ''శిష్యా కాళీ, నువ్వు క్షణాల మీద చాలా మారిపోయావు. మంత్రదండం తెచ్చిన వాళ్ళకు అర్ధ రాజ్యం, తన దత్తుకుమార్తెనూ యిస్తా నన్న యీ జితకేతురాజు మాటలు నమ్మి మోసపోకు,'' అన్నాడు.



''ఇందులో అర్ధరాజ్యం, రాజకుమా ర్తెతో వివాహం అన్న ప్రసక్తే లేదు. మంత్రదండం యిచ్చింది మహారాజుగారికి కాదు; నీకు గదా?'' అంటూ కాళీవర్మ రాజు జితకేతుడి కేసి చూశాడు.

రాజు జితకేతుడు ఒకసారి తలవూపి, ''ఇక్కడవున్న రాజు దుర్ముఖుడూ వాళ్ళ సమక్షంలో....'' అంటున్నంతలో రాక్షసుడు ఉగ్రదండుడు రాతిగద పైకెత్తి భీకరంగా అరుస్తూ సారంగం నుంచి బయటికి వచ్చి, ''రాజు దుర్ముఖుడే కాదు, నేనూవున్నాను. అదుగో, తలారి భల్లూకుడు కూడా వస్తున్నాడు. రాజా ఆ చెప్పబోయేదేదో మా అందరి సమక్షం లోనూ చెప్పు!'' అన్నాడు.

రాజు జితకేతుడు, ఉగ్రదండుణ్ణి చూసి ఒకక్షణం భయకంపితుడైపోయి, అంతలోనే ధైర్యం తెచ్చుకుని, ''నాకు సంతానం లేదు, నా తరవాత రాజ్యానికి ఎవర్ని వారసుడుగాపెట్టి పోదామా అని ఆలోచిస్తున్నాను. అనుకోకుండా యిప్పుడు మంచి అవకాశం లభ్యమైంది. సామంతు సూర్యభూపతి కుమార్తె నా దత్తురాలు. ఆమెను కాళీవర్మకిచ్చి వివాహం చేస్తాను. నా తరవాత యీ చంద్రశిలానగరం రాజ్యానికి అతడే రాజు!'' అన్నాడు.

భల్లూక మాంత్రికుడు, ''జై, భల్లూక పాదగురో!'' అంటూ పెద్దగా ఒక కేక పెట్టి, ''సాధ్యాసాధ్యాలు చూడకుండా, యిక్కడ గాలిమేడలు కట్టేస్తున్నారు. ఆ దుర్మార్గుడు తాంత్రిక మిశ్రుడు యీసరికి సూర్యభూపతి ఏకైక పుత్రికను.

చెరపట్టి, తన స్థావరం అయిన కొండ ప్రాంతాలకు బయలుదేరివుంటాడు. వాడికి ఎంతోకాలంగా భల్లూకేశ్వరికి ఒక పూజారిణిని సంపాయించాలని ఆశగా వున్నది,'' అన్నాడు.

''అది నేను జీవించివుండగా ఆ తాంత్రికుడికి సాధ్యం కాదు!'' అంటూ కాళీవర్మ కత్తి దూశాడు.

"నేనూ, అదే ప్రతిజ్ఞ చేస్తున్నాను, కాళీ!" అంటూ రాక్షసుడు ఉగ్రదండుడు రాతిగద పైకెత్తాడు.

భల్లూక మాంత్రికుడు చిన్నగా నవ్వి, ''మీ ప్రతిజ్ఞలు నెరవేరాలనే నేనూ కోరుకుంటున్నాను. ఉగ్రదండా! పనిలో పనిగా ఆ తాంత్రిక మిథ్యామిశ్రుణ్ణించి, నీ అన్న కాలదండుణ్ణి కూడా రక్షించుకో. అతడికేవో మందు మాకులతో మతిపోగొట్టి ఆ తాంత్రికుడు నమ్మిన బంటులా ఉపయోగించుకుంటున్నాడు. సరే, యిక వస్తాను!'' అంటూ సొరంగ మార్గం కేసి బయలుదేరాడు.

భల్లూక మాంత్రికుడు సొరంగ మార్గాన్ని చేరబోతున్నంతలో, ఒక పొద చాటు నుంచి తరారిభల్లూకుడు, ''దిరిసెనవన భైరవా!'' అంటూ గండ్రగొడ్డలి ఎత్తి, అతడి ముందుదూకి, ''మాంత్రిక భల్లూకా! నీ మంత్ర కారణంగా సగం భల్లూకంగా మారిన, యీ నగర తలారి మాటేమిటి? నువ్వూ, నేనూ, నీ గురువూ అందరం భల్లూక నామాలతో పెద్ద గందరగోళానికి కారణం అయాం. నన్ను తిరిగి మనిషిగా మారుస్తావా, యీ గండ్రగొడ్డలితో తలనరకమంటావా?'' అన్నాడు.

భల్లూక మాంత్రికుడు గడగడలాడిపోతూ, ''నువ్వు తలారి భల్లూకుడివి కాదు; ఈ నగర ప్రధాన తలారివి! పోయి, దిరిసెనవనంలో శిక్షపడిన వాళ్ళ తలలు నరుకు!'' అంటూ మంత్రదండంతో తలారిభల్లూకుడి తల మీద మూడుసార్లు కొట్టి, మెరుపు వేగంతో సొరంగంలోకి దిగిపోయాడు.

—(ముగింపు వచ్చే సంచికలో)





# రాక్షసభీతి-రాజనీతి

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా, అనరాదు గాని, నువ్వు పడుతున్న ఈ శ్రమ అంతా రాజధర్మానికి అనుగుణంగా ఉన్నట్టు నాకు తోచటంలేదు. నీ లాగే నిరంకుశ మహారాజు కూడా రాజనీతికి విరుద్ధమైన పనిచేశాడు. అతని కథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను,'' అంటూ ఇలా చెప్పసాగాడు :

ఒకప్పుడు నికుంజదేశాన్ని నిరంకుశుడనే రాజు పరిపాలిస్తూండగా, ఆ దేశపు సరిహద్దులో ఉన్న అరణ్యాలలోకి ఒక రాక్షసుడు వచ్చినట్టు వార్తలు పుట్టాయి. చాలామంది అరణ్యవాసులు ఆ రాక్షసుడికి భయపడి, అరణ్యంలో తమ నివాసాలు

బేతాళ కథలు



విడిచిపెట్టి పారిపోయివచ్చి, రాజుతో అ మాట చెప్పారు.

కలియుగం వచ్చిన ఇన్నివేల ఏళ్ళకు ప్రపంచంలో ఇంకా రాక్షసులున్నారంటే రాజు నమ్మలేకపోయాడు. అయినా ఆయన ఆటవికులను ప్రశ్నించి, ఆ రాక్షసుడు వాళ్ళకు ఎలాటి హానీ చెయ్యలేదనీ, వాళ్ళు పారిపోయిరావటానికి భయం తప్ప మరోకారణం లేదనీ తెలుసుకున్నాడు.

"వాడు రాక్షసుడని మీకు ఎలా తెలిసింది? చెట్టంత ఎత్తు ఉన్నాడా?" అని రాజు అడిగాడు.

ఆటవికులు సందేహిస్తూ, "మహారాజా, వాడు చెట్టంత ఎత్తు లేకపోతేనేం? బాగా అడవిదున్న ప్రమాణంలో ఉన్నాడు." అన్నారు.

"రాక్షసుడని ఎందుకు అనుకున్నారు?" అని రాజు మళ్ళీ వాళ్ళను అడిగాడు.

"మహారాజా, మేం కళ్ళారా చూశాం. వాడొక చెట్టు కింద కూర్చుని ఏవో కాయలూ, దుంపలూ తింటూంటే, పక్కనున్న పొదలో నుంచి ఒక పెద్దపులి వాడి మీదికి దూకింది. వాడు దాన్ని వెనక కాళ్ళతో పట్టుకుని, చెట్టు కేసి కొట్టి చంపాడు! రాక్షసుడు కాకపోతే అలా చెయ్యగలడా, మహారాజా? వాడి దగ్గిర బాణాలు గాని, బరిసెలు గాని లేవు. అయినా వాడు లేళ్ళనూ, దుప్పులనూ పట్టి చంపి, కాల్చుకు తినటం మా వాళ్ళు చాలామంది చూశారు!" అన్నారు ఆటవికులు.

రాజు కాస్సేపు ఆలోచించి, "ఆ రాక్షసుడి సంగతి నేను చూస్తాను. మీరు అకారణంగా భయపడుతున్నారేమో. వాడు మీకు అపకారం చేసినప్పుడు నాకు చెప్పండి. నేను వాడి భయం మీకు లేకుండా చేస్తాను. మీకు వాడంటే భయమైతే, కొంతకాలం నగరం శివార్లలో ఉండండి. మీకు కావలసిన సదుపాయాలు నేను చేస్తాను." అన్నాడు.

ఆటవికులు అనుమానంగా ఒకరి ముఖాలు ఒకరు చూసుకుని, ఏదో గొణుగుకుంటూ వెళ్ళిపోయారు.

వాళ్ళు వెళ్ళగానే మంత్రి ఎంతో ఆందోళనగా, "అదేమిటి, మహారాజా? మీరా రాక్షసుణ్ణి చంపించే ఆలోచనలో లేరా?" అన్నాడు.

"లేను. ఏం?" అన్నాడు రాజు.

"పులులను ఉత్తచేతులతో చంపగల వాడు మామూలు మనుషులకు హాని చేయడా? వాణ్ణి ఉపేక్షించటం భావ్యమా?" అన్నాడు మంత్రి.

"క్రూరమృగాలను కూడా, వాటివల్ల ప్రజలకు హానికలిగితేనే గాని, వేటాడం గదా! ఈ రాక్షసుణ్ణి ఉత్తపుణ్యానికి ఎందుకు వేటాడటం?" అన్నాడు రాజు నిరంకుశుడు.

"మహారాజా, మీ ఆలోచన నాకు అంతుబట్టలేదు. వాడు మృగాలకే క్రూరుడు! రాక్షసుడు! ఆ జాతే మానవులకు శత్రుజాతి! వాణ్ణి సంహరించటం కర్తవ్యం అన్నదాన్ని గురించి ఆక్షేపణ దేనికి?" అన్నాడు మంత్రి.

రాజు మరికొంచెంసేపు ఆలోచించి, "అదే మీ అభిప్రాయం అయితే, ఆ రాక్షసుణ్ణి చంపే ప్రయత్నం మీరు చెయ్యండి." అన్నాడు.

మంత్రికి ప్రాణం లేచివచ్చినట్టయింది. ఆయన వెంటనే ఉపసేనానాయకుణ్ణి ఒకణ్ణి పిలిచి, "నువు కొందరు సాయుధ





భటులను తీసుకుపోయి, అరణ్యమంతా గాలించి, రాక్షసుడు ఎక్కడున్నాడో తెలుసుకుని, వాణ్ణి చంపి, వాడి శవాన్ని పట్టుకురా,'' అని ఉత్తరువిచ్చాడు.

ఆ ఉపసేనానాయకుడికి భయం అంటే ఏమిటో తెలీదు. యుద్ధరంగంలో అతను శత్రుపక్షం వాళ్ళ ఏనుగులను ఎదిరించి చంపినవాడు!

అతను ఇరవైమంది సాయుధభటులతో అరణ్యంలోకి వెళ్ళాడు. కొంతసేపటికి వాళ్ళకు రాక్షసుడి జాడ తెలిసింది. ఒక పెద్దపులి చేసే ఆర్తనాదాలు వాళ్ళకు వినిపించాయి. వాళ్ళు అటుగా వెళ్ళేసరికి, రాక్షసుడు ఒక పులిని వెల్లికిలా పడేసి, దాని వెనక కాళ్ళు పట్టుకుని, పొట్ట మీదా, కంఠం మీదా కాళ్లు పెట్టి తొక్కుతున్నాడు. రాజభటులు చూస్తూండగానే పులి నెత్తురు కక్కి చచ్చింది.

రాక్షసుడు తల ఎత్తి చూసేసరికి, సైనికవీరుడి వెంట వచ్చిన భటులు చావుకేకలు పెట్టుతూ, పారిపోయినారు. సైనికవీరుడు మాత్రం కత్తిదూసి, రాక్షసుడితో పోరాటానికి సిద్ధంగా నిలబడ్డాడు. రాక్షసుడు చాలా పొడుగైన మనిషి కన్న మరొక జానెడు ఎత్తుంటాడు. కాని వాడి శరీరదార్ఢ్యం వర్ణనాతీతం.

వాడు పులి మీది నుంచి దిగి, పులి శవాన్ని ఒక్క చేత్తో ఎత్తి పొదల మీదిగా దూరంగా విసిరేసి, చేతులు దులుపుకుంటూ వీరుడికేసి వచ్చి, "ఏం వచ్చావు?" అని మనిషిభాషలో అడిగాడు.

వీరుడికి ఆశ్చర్యం అయింది. వాడు మనిషే అయితే వాణ్ణి చంపటం అసంభవం ఏమీ కాదనుకుని, ''నిన్ను చంపటానికి వచ్చాను. రాజాజ్ఞ!'' అన్నాడు.

''కాదు చావటానికి వచ్చావు!'' అంటూ రాక్షసుడు వీరుడి కత్తి చేతి మీద కొట్టి, కింద పడిన కత్తిని కాలితో తొక్కి విరిచి, ''వెళ్ళు!'' అన్నాడు.

మంత్రి పంపిన వీరుడు తిరిగివెళ్ళి, మంత్రితో జరిగినదంతా చెప్పాడు. మంత్రి

రాజుకు అంతా వివరించి, "ఇప్పుడేం చేద్దాం?" అని అడిగాడు.

"ఏమీ చెయ్యనవసరం లేదు! మీరు మీ పని చూసుకోండి," అన్నాడు రాజు, ఇక రాక్షసుడి విషయం తన వద్ద ఎత్త వద్దని సూచిస్తూ.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, రాక్షసుణ్ణి గురించి నిరంకుశ మహారాజు మొదటినుంచీ ఉదాసీనంగా ఉండటానికి కారణం ఏమిటి? రాక్షసులతో పేచీ పడటం ప్రమాదమనా? రాక్షసజాతి మానవజాతికి శత్రువు కదా? ఆరంభంలో ఆయన ఆటవికుల మాటలు నమ్మకపోయి ఉండవచ్చు. కాని తన భటులు స్వయంగా రాక్షసుణ్ణీ, వాడి శక్తినీ కళ్ళారా చూసినప్పుడు, రాజు తన సేనలన్నిటినీ ఉపయోగించి అయినా వాణ్ణి చంపవద్దా? నిరంకుశుడు అలా ఎందుకు చెయ్యలేదు? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "రాజు వైఖరి సరి అయినదే. రాక్షసులు కూడా మానవులలో ఒక జాతివాళ్ళే. రాజ్యాంగంలో అనేక జాతులకు స్థానం ఉన్నది. ఒక జాతివాళ్ళను గాని, ఒక కులంవాళ్ళను గాని ఏ తప్పూ చేయకుండా దండించటం రాజనీతి కాదు. పురాణకాలంలో కూడా మానవజాతికి హానిచేసిన రాక్షసులనే విష్ణువు మానవరూపంలో చంపాడని వింటున్నాం. నేరాలు చేసిన వ్యక్తులనే దండించటం రాజనీతి. ఆ రాక్షసుడు కూడా ఒక వ్యక్తే. వాడు తనను చంపుతానని వచ్చిన వీరుణ్ణే ప్రాణాలతో వదిలాడు. అలాటప్పుడు వాడు మామూలు మనుషులకు ఎందుకు ప్రమాదం కలిగిస్తాడు? నికుంజదేశపు మంత్రి ప్రకటించిన జాతి ద్వేషం రాజనీతికి విరుద్ధమైనది," అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)



# నిరర్థకమైన అభిమానం

రామయ్యకు అంటువ్యాధి సోకింది. ఆయనను చూసుకోవటానికి చిన్నకూతురు ఉమ మాత్రమే ఉన్నది. పెద్దకూతురు శశిరేఖ పెళ్ళి చేసుకుని, అత్తవారింటికి వెళ్ళిపోయింది.

రామయ్య వాడుకునే వస్తువులు ఎడంగా ఉంచమని వైద్యుడు ఉమను హెచ్చరించాడు. ఆయన పథ్యం కూడా చెప్పాడు. ఉమ వైద్యుడు చెప్పినట్టే చేస్తున్నది. కాని అది రామయ్యకు నచ్చలేదు. తన కంచమూ, గ్లాసూ వేరే ఉంచటమూ, తన ఇష్టమైనది తిననియ్యక పోవటమూ చూసి ఆయన ఉమ మీద మండిపడ్డాడు. కాని ఉమ ఆయన ఇష్టం సాగనియ్యలేదు. అందుకని ఆయన శశిరేఖకు కబురు పంపాడు.

శశిరేఖ వచ్చి, ఆయన స్థితి చూసి జాలిపడి, ఆయన వస్తువులు విడిగా ఉంచనవసరం లేదనీ, ఆయన కోరినది తినవచ్చుననీ నిర్ణయించింది. ఉమ అభిప్రాయం చెల్లలేదు. రామయ్య పరమానందం చెందాడు. ఉమను శశిరేఖ అత్తవారింటికి పంపారు.

అయితే శశిరేఖ వచ్చినది మొదలు రామయ్య ఆరోగ్యం కోలుకుంటున్నది కాస్తా తిరిగి క్షీణించసాగింది. వైద్యుడు కంగారుపడి, రామయ్య అపథ్యం చేస్తున్నట్టు శంకించాడు. లేదని శశిరేఖ అబద్ధమాడింది.

అంతలోనే శశిరేఖకు కూడా ఆ అంటువ్యాధి సోకింది. శశిరేఖ భర్త ఉమ ద్వారా సంగతి తెలుసుకుని, శశిరేఖను తిట్టి, ఆమెనూ, రామయ్యనూ తీసుకుపోయి చికిత్స చేయించాడు. ఉమ అనుసరించిన పద్ధతిలోనే ఇద్దరూ కోలుకున్నారు.

—జొన్నలగడ్డ రామలక్ష్మి

15





# మదిరావతి కథ

పూర్వం ఉజ్జయినీ నగరంలో యశస్కరుడనే బ్రాహ్మణు డుండేవాడు. ఆయన కుమారుడు శశిభూషణు డనేవాడు చాలా అందగాడు, మంచివాడు కూడా. అతడికి గురువు దగ్గిర విద్య అభ్యసిస్తూండగా విజయసేను డనే క్షత్రియ బాలుడితో స్నేహమయింది.

ఒకనాడు విజయసేనుడి వెంట అతని చెల్లెలు మదిరావతి అనే పిల్ల గురువుగారింటికి వచ్చింది. మదిరావతి కూడా అసాధారణ సౌందర్యవతి. ఆమెను చూసినది మొదలు శశిభూషణుడికి ఆమె మీద అంతులేని ప్రేమ కలిగింది.

మదిరావతి ఇంటికి వెళ్ళి తన తల్లితో శశిభూషణుడి గురించి చాలా గొప్పగా చెప్పింది. శశిభూషణుణ్ణి ఒకసారి పిలుచుకురమ్మని తల్లి విజయసేనుడితో అన్నది.

మర్నాడు విజయసేనుడు తన స్నేహితుడైన శశిభూషణుణ్ణి వెంటబెట్టుకుని వెళ్ళాడు. విజయసేనుడు తండ్రితో ఏదో మాట్లాడుతూ వుండగా ధాత్రేయి అనే అమ్మాయి, మదిరావతి స్నేహితురాలు, ఒంటరిగా వున్న శశిభూషణుడి వద్దకు వచ్చి, అతనికి మాలతీ పూలదండ ఇచ్చి, ''దీనిని నా సఖి మదిరావతి ఎవరికీ తెలియకుండా నీకోసం అల్లింది, తీసుకో!'' అన్నది.

''నీ సఖికి కావలిస్తే నా ప్రాణాలైనా ఇస్తానని చెప్పు,'' అన్నాడు శశిభూషణుడు.

అది మొదలు శశిభూషణుడూ, మదిరావతీ తరచు మాట్లాడుకుంటూండేవారు. నానాటికీ వారి ప్రేమ పెరగసాగింది.

ఇంతలో ఒకనాడు ఒక క్షత్రియ కుమారుడు వచ్చి, మదిరావతిని తనకిచ్చి వివాహం చెయ్యవలసిందని ఆమె



ఏ విధంగానైనా మదిరావతి పెళ్ళి తప్పిపోతుందేమోనన్న ఆశ అంతవరకూ శశిభూషణుడి మనస్సులో ఉంటూ వచ్చింది. అది కాస్తా ఇప్పుడు అడుగంటింది. శశిభూషణుడు ఈ బాధ భరించే కన్న ఆత్మహత్య చేసుకోవటం నయమనుకున్నాడు. పెళ్ళిపీటల మీద కూచునే ముందు మదిరావతి తోడుపెళ్లికూతుళ్లతో సహా ఊరి వెలపల ఉన్న అమ్మవారి గుడికి వచ్చి అక్కడవుండే కామదేవుడికి పూజ చేస్తుంది. ఆ గుడికి సమీపంగా దారిలో ఒక మర్రిచెట్టున్నది. ఆ చెట్టు కొమ్మకు ఉరివేసుకున్నట్టయితే మదిరావతి కనీసం తన శవాన్నయినా చూడగలుగుతుందనే ఉద్దేశంతో శశిభూషణుడు అక్కడికి బయలుదేరాడు.

తండ్రిని కోరాడు. తన కుమార్తె మరొకరిని ప్రేమిస్తున్నదని తెలియక తండ్రి అంగీకరించాడు. లగ్నం కూడా నిశ్చయమైపోయింది.

మదిరావతి వివాహం నిశ్చయమైన క్షణం నుంచీ శశిభూషణుడికి మనోవ్యాధి పట్టుకున్నది. కనీసం ఒక్కసారి మదిరావతిని కళ్ళారా చూసి తన మనోవేదనకు కొంత ఉపశాంతి చేసుకుందామన్నా వీలు పడిందికాదు.

పెళ్ళిరోజు వచ్చింది. మదిరావతికి తలంటి పెళ్లికూతుర్ని చేశారు. త్వరలోనే మంగళ వాద్యాలతో సహా పెళ్ళికొడుకు వచ్చాడు.

ఈలోపల మదిరావతి స్నేహితురాలు ధాత్రేయి ఆ ఉదయమే శంఖహ్రద మనే కోనేటికి స్నానం చేయబోయింది. ఆ కోనేటి ఒడ్డున ఆమె పూలు కోస్తూండగా, ఆమెకు సోమదత్తుడనే బ్రాహ్మణయువకుడొకడు కనిపించాడు. ఆ బ్రాహ్మణ యువకుడు పూలు కోస్తూన్న తన వంక కన్నార్పకుండా చూస్తూ వుండటం గమనించి ధాత్రేయి సిగ్గుపడింది.

ఈ సమయంలో దూరాన కలకలం వినబడింది. గొలుసులు తెంచుకున్న మదపు

ఏనుగు ఒకటి వారున్నవైపే వాయు వేగంతో వస్తోంది. ఏమిచెయ్యాలా అని ధాత్రేయి ఆలోచించేలోపుగా, పరదేశీ అయినా ఆ సోమదత్తుడు ఆమెను తన చేతులతో ఎత్తుకుని పారిపోయి, దూరాన గుమిగూడి ఉన్న జనం దగ్గిర ఆమెను చేర్చాడు.

అంత ధైర్యసాహసాలతో తనను కాపాడిన ఆ యువకుడి పూర్వోత్తరాలు ధాత్రేయి తెలుసుకునేలోపునే ఆ మదపుఏనుగు జనం మీదికి వచ్చింది. ఎక్కడివారక్కడ చెల్లాచెదరుగా పారిపోయినారు. సోమదత్తుడు కూడా పారిపోయినాడు. అతను ధాత్రేయిని కలుసుకుని ఆమె సమాచారం తెలుసుకుందామని తిరిగి అక్కడికి వచ్చేసరికి ఆమె కనబడలేదు. తన ప్రియసఖి మదిరావతి లగ్నముహూర్తం దగ్గిరపడటం మూలాన ఆమె సోమదత్తుడి విషయం విచారించే అవకాశం లేకపోయింది.

తాను రక్షించిన పిల్ల ఎవరో, ఆమె పేరేమిటో సోమదత్తుడికి తెలియదు. ఆమె కనబడినదాకా విశ్రమించరాదని అతను నిశ్చయించుకుని బయలుదేరి, చాలా దూరం నడిచాడు. అతనా విధంగా నడుస్తూ అమ్మవారి ఆలయ ప్రాంతానికి వచ్చేసరికి దారిపక్క మర్రిచెట్టు నుండి వేలాడుతూ ఒక యువకుడి శరీరం సోమదత్తుడి కంట పడింది. సోమదత్తుడు వెంటనే దగ్గిరికి వెళ్ళి ఆ శరీరాన్ని కిందికి దించి చూశాడు. ఉరివేసుకున్న శశిభూషణుడు స్పృహ





తప్పి ఉన్నాడు గాని, చావలేదు. సోమదత్తు డతనికి ఉపచారాలు చేయ సాగాడు.

కొద్దిసేపట్లో శశిభూషణుడికి స్పృహ కలిగింది. అతను లేచి కూచుని సోమ దత్తుణ్ణి చూసి, "నా ప్రాణం కాపాడిన దయామయుడివి, ఎవరు నాయనా నీవు? నన్నెందుకు బతికించావు? నా జీవితం నిరర్థకమైనది," అంటూ తన కథ చెప్పాడు.

అంతా విని సోమదత్తుడు, "వెర్రివాడా, ఇదేనా పురుషకారం? నేనూ నీలాగే ఒక కన్యను ప్రేమించాను. ఆమె ఎవరో తెలియకుండానే ఆమె కోసం అన్నిచోట్లా వెతుకుతున్నాను," అంటూ తన కథ చెప్పాడు.

వాళ్ళిద్దరూ ఆ విధంగా మాట్లాడు కుంటూండగానే దూరాన మంగళ వాద్యాలు వినపడ్డాయి.

"అదుగో, మదిరావతి కామదేవుణ్ణి పూజించటానికి వస్తోంది," అన్నాడు శశిభూషణుడు.

"అయితే మనం గుడిలో విగ్రహాల వెనక దాక్కుందాం," అన్నాడు సోమ దత్తుడు.

ఇద్దరూ విగ్రహాల వెనక దాగిన కొద్ది సేపటికి మదిరావతి తన చెలికత్తెలతో సహా గుడి చేరింది. మిగిలినవారి నందరినీ బయటనే ఉంచి ఆమె ఒంటరిగా గర్భ గుడిలోకి వచ్చి, తలుపు మూసి గడియ పెట్టి, "ఓ కామదేవా! నేను ఒకరిని ప్రేమిస్తే నన్ను మరొకరి కెందుకిచ్చి పెళ్లి చేస్తున్నావు? నా కోరిక యీ జన్మలో తీరని పక్షంలో త్వరలో మరొక జన్మలో నైనా శశిభూషణుడి భార్య అయేలాగు అనుగ్రహించు, తండ్రీ!" అని ప్రార్థించి, తన వల్లెవాటు కంఠానికి చుట్టి ఉరి వేసుకోబోయింది.

ఈ సమయంలో శశిభూషణుడు విగ్రహం చాటునుండి పరిగెత్తుకుంటూ వచ్చి ఆమెను వారించాడు.

సోమదత్తుడు కూడా ఇవతలికి వచ్చాడు.

"మాటలకు వ్యవధి లేదు. కనుచీకటి పడింది. నీ ప్రియురాలికి నా దుస్తులు కట్టించి ఆమెను వెంటపెట్టుకుని గ్రామాంతరానికి బయలుదేరు. ఈలోగా నే నీమె దుస్తులు ధరించి బయటికి పోతాను," అన్నాడు సోమదత్తుడు.

సోమదత్తుడు మదిరావతి పెళ్ళిబట్టలు ధరించి, ముఖం కనబడకుండా వల్లె మేలిముసుగు వేసుకున్నాడు. తలుపు తెరిచి బయటికి వెళ్లాడు. చెలికత్తెలు మదిరావతే తిరిగి వచ్చిందనుకుని, పెళ్లి పాటలు పాడుతూ, మేళతాళాలతో తిరిగి వెళ్లిపోయారు. వారు వెళ్లిపోయిన కొంత సేపటికి శశిభూషణుడూ, పురుష వేషంలో ఉన్న మదిరావతీ అడవి మార్గాన బడి తెల్లవార్లూ ప్రయాణం చేసి చివరకు అచలపుర మనే ఊరు చేరారు. అక్కడ ఒక బ్రాహ్మణుడు వారికి తన యింట ఆశ్రయమిచ్చాడు, అక్కడే వారు ఒక దేవాలయంలో శాస్త్రోక్తంగా వివాహం చేసుకున్నారు.

ఇక్కడ మదిరావతి వేషంలో ఉన్న సోమదత్తుడు పెళ్లి యింటికి వచ్చేసరికి ధాత్రేయి శంఖహ్రదం నుంచి తిరిగి వచ్చింది. తనకు కలిగిన అనుభవాన్ని తన ప్రియసఖితో చెప్పుకోవటానికి ఆమెకు విశేషం వ్యవధి లేదు. అందుచేత ధాత్రేయి, మదిరావతి రెక్క పట్టుకుని,



"సఖీ, నీతో ఒక రహస్యం చెప్పాలి, రా!" అని ఏకాంతంగా ఒక గదిలోకి తీసుకుపోయింది. ఈ లోపలే మేలి ముసుగులో నుంచి ధాత్రేయిని చూసి గుర్తుపట్టిన సోమదత్తుడు, "నేను కల గంటున్నానా? ఏదైనా మాయా? లేక భగవంతుడి అనుగ్రహమా?" అని తనలో తాను ఆశ్చర్యపడసాగాడు.

"సఖీ, నీకు ప్రియుడు కానివాడు భర్త కాబోతున్నాడు. నీ బాధ నాకు తెలుసు. కాని ఈ బాధను నీవు భరించ లేనప్పుడు నా సంగతి జ్ఞాపకం తెచ్చుకో, ఎందుకంటే నేను అభాగ్యురాలిని. నీలాగే నేనూ ఒక యువకుణ్ణి ప్రేమించాను. కాని అతనెవరో, పేరేమిటో, ఎక్కడ వుంటాడో కూడా నే నెరగను. నీప్రియుణ్ణి నీవు మళ్ళీ చూడగలుగుతావు. నాకా ఆశకూడా లేదు," అంటూ ధాత్రేయి తన కథ యావత్తూ చెప్పింది.

ఇదంతా వింటున్న సోమదత్తుడు పర మానంద భరితుడై, ధాత్రేయి మాట్లాడడం పూర్తిచేయగానే మేలిముసుగు తొలగించి, తన ముఖం కనబరిచాడు. ధాత్రేయి ఆనందానికీ, ఆశ్చర్యానికీ మేరలేదు. సోమదత్తుడు జరిగినదంతా వివరించి, మదిరావతి శశిభూషణుడితో సహా పారి పోయిందని చెప్పేదాకా ధాత్రేయి తన కళ్ళను తానే నమ్మలేకపోయింది.

"మనం ఇలా కబుర్లు చెప్పుకుంటూ కూచుంటే లాభం లేదు, మనం కూడా వేగిరం వెళ్ళిపోకపోతే గుట్టు బయట పడుతుంది. మనం యిక్కడినుంచి పారిపోయే ఉపాయం ఆలోచించు!" అన్నాడు సోమదత్తుడు.

ధాత్రేయి తన నగలన్నీ మూటగట్టు కుని, సోమదత్తుణ్ణి వెంటబెట్టుకుని దొడ్డి దారిన బయటికి వచ్చి, చీకటిలో తోటల మధ్యగా, దొడ్ల మధ్యగా ఊరిబయటికి తెచ్చింది. అక్కడినుండి వారు బయలు దేరి కొన్నాళ్ళు ప్రయాణం చేసి ఒక అగ్రహారం చేరి, అక్కడ పెళ్లాడి నివాసం ఏర్పరుచుకుని సుఖంగా ఉన్నారు.





# పరశురామ ముడు

## 2

కార్తవీర్యార్జునుడు అనే వాడు హైహయ వంశపు రాజు. కృతవీర్యుడి కొడుకు కావటాన కార్తవీర్యుడు అయాడు. అతని అసలు పేరు అర్జునుడు. అతని కొడుకులు పరమ దుర్మార్గులు. జమదగ్ని, అతని కొడుకులూ ఆశ్రమంలో లేని సమయం చూసి, వాళ్ళు జమదగ్ని హోమధేనువును, దూడతో సహా ఎత్తుకుపోవ యత్నించారు. కాని ఎంత ప్రయత్నించినా అది వారికి చిక్కలేదు.

తరవాత కార్తవీర్యుడు జమదగ్ని ఆశ్రమానికి వచ్చి, అతిథిసత్కారాలన్నీ పొంది, జమదగ్ని వద్ద ఉన్న గోవు సమస్తాన్నీ ఇయ్యగల కామధేనువు అని విని, దానిని తన కియ్యమని జమదగ్నిని కోరాడు. జమదగ్ని నిరాకరించాడు. కార్తవీర్యుడికి కోపం వచ్చి, జమదగ్నిని చంపాడు. కాని గోవును తీసుకుపోవటం అతనికి సాధ్యం కాలేదు.

ఆ సమయానికి రాముడు అరణ్యంలో ఉన్నాడు. అతనికి ఉన్నట్టుండి గుండె బరువెక్కినట్టు అనిపించి, మనసు వ్యాకులం చెందింది. ఏదో కీడు జరిగిందని శంకించి, అతను ఆశ్రమానికి వచ్చేసరికి, తన తండ్రి శవం మీద పడి ఏడుస్తూ తల్లి కనిపించింది. హైహయుడు తన భర్తను చంపాడని కొడుకుతో చెబుతూ ఆమె ఇరవై ఒక్కసారి గుండెలు బాదుకున్నదట!

రాముడు తల్లిని ఓదార్చి, ఇరవై ఒక్కసార్లు క్షత్రియకులాలను నిర్మూలిస్తానని శపథం పట్టి, తన తండ్రి శవాన్ని దహనం చేసే ప్రయత్నం ప్రారంభించాడు. ఇంతలో భృగుమహర్షి అక్కడికి వచ్చి,

జమదగ్ని మీద మంత్రజలం చల్లేసరికి, జమదగ్ని బతికి లేచాడు.

రాముడు తిరిగి బతికిన తన తండ్రికి ఉపచారాలు చేస్తూ, క్షత్రియుడి దౌష్ట్యానికి ప్రతిక్రియగా తాను ఇరవై ఒక్క సారి క్షత్రియ నిర్మూలనం చేస్తానని శపథం చేసిన సంగతి తండ్రికి చెప్పాడు.

జమదగ్ని రాముడి ఆగ్రహాన్ని శాంతింప జేయటానికి ప్రయత్నించాడు కాని, ఉదాసీనంగా ఉండటం నేరస్థులను ప్రోత్సహించటం అవుతుందనీ, నిష్కారణంగా హత్యలు చేసేవారిని విడిచిపెట్టరాదనీ రాము డన్నాడు.

తన కొడుకు చాలా పట్టుదలగా ఉండటం గమనించి జమదగ్ని అతన్ని బ్రహ్మ వద్దకు వెళ్ళమనీ, బ్రహ్మ చెప్పినట్టు చెయ్యమనీ అన్నాడు.

రాముడు బ్రహ్మ వద్దకు వెళ్ళి, తాను క్షత్రియనిర్మూలనం చెయ్యటం గురించి బ్రహ్మయొక్క అభిప్రాయం అడిగాడు. రాముడు చేసిన ప్రతిజ్ఞ బ్రహ్మకు నచ్చలేదు. అయినా ఆ మాట అనటం ఇష్టం లేక ఆయన రాముడితో, "ఈశ్వరుడు అనుగ్రహించనిదే నీ ప్రతిజ్ఞ నెరవేరడం సాధ్యం కాదు. అందుచేత శివుడి వద్దకు వెళ్ళు," అన్నాడు.

రాముడు శివుడి వద్దకు వెళ్ళేసరికి శివుడి వెంట పార్వతి కూడా ఉన్నది. ఆమె తన శపథం గురించి అతను చెప్పగా విని, "శివుడి అనుగ్రహంతో ఏదైనా



సాధ్యమే. అయినా, నీ వద్ద అస్త్రాలు లేవుగదా!'' అన్నది.

ఆ మాట విని శివుడు రాముడికి అస్త్రాలూ, కవచమూ ఇచ్చాడు.

రాముడు వాటిని పుచ్చుకుని తిరిగి వస్తూ, వాటిని ఒక కొలను గట్టున పెట్టి జపం చెయ్యటానికి కూర్చున్నాడు. ఇంతలో ఒక లేళ్ళ జంట, ఎవరో తమను వేటాడుతున్నట్టుగా, అతివేగంగా వచ్చి కొలనులో నీళ్ళు తాగాయి.

వాటిని వేటాడిన మనిషి రాముడికి కనబడలేదుగాని, ఆడ మృగంతో మగ మృగం, ''ఇక మనకు భయంలేదు. ఈ జపం చేస్తున్నవాడు పరశురాముడు. ఇతను అగస్త్యుడి ఆశ్రమానికి వెళ్ళి, కృష్ణామృతస్తోత్రం వింటే ఇతనికి కృష్ణ కవచం లభిస్తుంది,'' అనటం పరశు రాముడికి స్పష్టంగా వినబడింది.

రాముడు ఆ ప్రకారమే అగస్త్యాశ్రమానికి బయలుదేరాడు. దారిలో అతనికి మృగాలను తరిమిన వేటగాడు కనిపించాడు. అతను వాణ్ణి చంపి, అగస్త్యాశ్రమం చేరి, అక్కడ కృష్ణ స్తోత్రం విన్నాడు. తరవాత అతను కృష్ణుణ్ణి ప్రార్థించగా, కృష్ణుడు ప్రత్యక్షమై, రాముడికి తన తేజస్సు ఇచ్చాడు.

తరవాత రాముడు నర్మదలో స్నానం చేసి, కార్తవీర్యుడు ఉండే నగరానికి వెళ్ళి, తాను కార్తవీర్యుణ్ణి చంపటానికి వచ్చానని రాజుకు కబురు చేశాడు.



"బ్రాహ్మణుడు ఏది అడిగినా లేదననను. జమదగ్ని కొడుకు యుద్ధం అడిగితే తప్పక ఇస్తాను," అని కార్తవీర్యుడు రాముడికి జవాబు పంపాడు. ఆ తరవాత అతను తన సేనలను యుద్ధసన్నద్ధం చేసి పరశురాముడి మీదికి యుద్ధానికి పంపాడు.

అయితే రాముడు తన పరశువుతో ఆ సేనలను చిందరవందర చేశాడు.

రాముడి మీదికి ఇతర క్షత్రియులు వచ్చి యుద్ధం చేసి, చచ్చారు. అలా చచ్చినవారిలో మత్స్యరాజూ, మగధ రాజూ, నిషాదరాజూ, విదర్భరాజైన సోమదత్తుడూ, మిథిలరాజైన బృహద్బలుడూ ఉన్నారు.

అలాగే కన్యాకుబ్జరాజూ, సౌరాష్ట్ర రాజూ, అవంతికి చెందిన వీరులూ ఒక్కసారిగా రాముడి మీదికి వచ్చి, అతని మీద బాణవర్షం కురిపించారు, కాని రాముడు ఆ బాణాలన్నిటినీ విరిచి, వారందరినీ చంపేశాడు.

సుచంద్రుడు అనే రాజు రాముడి మీదికి యుద్ధానికి వచ్చి, అతని మీద శివుడి త్రిశూలాన్నే విసిరాడు. అయితే అది కాస్తా పుష్పమాల అయి, రాముడి మెడలో పడింది. ఆ క్షణంలో రాముడికి కాళి కనిపించి, ఆగ్నేయాస్త్రం వేస్తే సుచంద్రుడు చస్తాడని చెప్పింది. సుచంద్రుడు ఆగ్నేయాస్త్రంతో చచ్చినాక, అతని కొడుకు పుష్కరాక్షుడు అనేవాడు రాముడితో యుద్ధం చేసి చచ్చాడు.

ఇంతమంది చచ్చినాక కార్తవీర్యుడు రాముడితో యుద్ధానికి స్వయంగా వచ్చి, త్రిశూలంతో రాముణ్ణి మూర్ఛపోగొట్టాడు. రాముడు పడిపోయాడు. దేవతలంతా వచ్చారు. వారి వెంట వచ్చిన శివుడు రాముణ్ణి సంజీవనితో బతికించాడు.

రాముడు లేచి, శివకవచం పఠించి, కార్తవీర్యుడిపైన బాణం వేసేసరికి, అతని తల బద్దలైపోయింది. కార్తవీర్యుడి కొడుకులందరూ రాముడి చేతిలో చచ్చారు. —(ఇంకా వుంది)





# మహాప్రస్థానం

మహాభారత యుద్ధంలో గెలిచిన పాండవులు చాలా కాలం సుఖంగా రాజ్యం చేశారు. చివరకు ధర్మరాజు రాజ్యం విడిచి మహాప్రస్థానం చేయ సంకల్పించాడు.

రాజ్యత్యాగం చేస్తున్న ధర్మరాజు తమ మనమడైన పరీక్షిత్తుకు పట్టాభిషేకం మహావైభవంగా చేశాడు. ఋషులూ, సామంతులూ పరీక్షిత్తును ఆశీర్వదించారు.





అనంతరం పాండవులు హిమాలయాలకు బయలుదేరారు. వారి వెంట ద్రౌపది కూడా బయలుదేరింది. అందరూ సామాన్యమైన దుస్తులు ధరించారు. రాజ్యవిభవాన్ని వదిలిపెట్టిన చింత వారికి లేదు.



వారు హిమాలయ పర్వతాలను ఎక్కసాగారు. దారి బహుకష్టమైనదీ, దీర్ఘమైనదీనూ. దారిలో వారికి అనేక పుణ్యక్షేత్రాలూ, ఋష్యాశ్రమాలూ, దేవతానివాసాలూ తగిలాయి. దారిలో మొదట ద్రౌపది చచ్చి పడిపోయింది. తరవాత పాండవులు ఒక్కొక్కరే చచ్చిపడిపోసాగారు. చివరకు ధర్మరాజు ఒక్కడే మిగిలాడు.

ఒంటరిగా పోతున్న ధర్మరాజు తన వెంట ఒక కుక్క వస్తున్న సంగతి గ్రహించాడు. దారి ఎంత ప్రమాదకరంగా ఉన్నా కూడా కుక్క ధర్మరాజును విడవకుండా అనుసరించింది.





ధర్మరాజు హిమాలయ శిఖరాన్ని చేరుకోగానే అతనికి ఇంద్రుడు కనిపించి అతన్ని స్వర్గానికి ఆహ్వానించాడు. తన వెంట ఉన్న కుక్కను కూడా రానిస్తేనే తాను స్వర్గానికి రాగలనని ధర్మరాజు అన్నాడు.

ఇందుకు ఇంద్రుడు ఒప్పుకోకపోయే సరికి, ధర్మరాజు ఇంద్రుడి రథం ఎక్కలేదు. అప్పుడు కుక్క యమధర్మరాజు రూపం ధరించింది. యముడు పెట్టిన పరీక్షలో ధర్మరాజు నెగ్గాడు.





స్వర్గం చేరిన ధర్మరాజుకు దేవతలు స్వాగతం చెప్పారు. అయితే ఆయన తన తమ్ముల కోసమూ, ద్రౌపది కోసమూ చూడగా, వారంతా నరకంలో ఉన్నట్టు తెలిసింది. ధర్మరాజు స్వర్గాన్ని నిరాకరించి నరకానికే పోతానన్నాడు.

నరకద్వారం నుంచి చూస్తే ధర్మరాజుకు నరక దర్శనం అయింది. అయితే, తన తమ్ములూ, ద్రౌపదీ నరకంలో కొంతకాలం ఉండి, స్వర్గానికి వెళ్ళారనీ, తాను చిన్న పాపం చేసినందున నరకాన్ని సందర్శించవలసి వచ్చిందనీ ధర్మరాజు తెలుసుకున్నాడు.






తరవాత ధర్మరాజు శాశ్వతంగా స్వర్గానికి వచ్చి చేరాడు. ప్రాపంచిక జీవితం గడుపుతూ కూడా మనిషి సత్యానికి కట్టుబడి, పుణ్యాత్ముడుగా ఉండవచ్చుననటానికి ధర్మరాజు జీవితమే నిదర్శనం.



# అసలైన రత్నం

సిద్ధిపురం నుండి నాగరాజూ, కృష్ణయ్యా కలిసి తీర్థయాత్రలకు బయలుదేరి వెళ్ళారు. వారు గుర్రాల మీద ప్రయాణం చేస్తూ కాశీ వెళ్ళి, విశ్వేశ్వరుణ్ణి దర్శించి, ప్రయాగ వెళ్ళి, త్రివేణీ సంగమంలో స్నానం చేసి, పీపాలతో గంగాజలం తీసుకుని, తిరుగు ప్రయాణమయారు.

దారిలో ఒక చోట ఒక చెట్టు కింద వారికి ఒక ముసలి తాతా, అతని భార్యా కనిపించారు ఆమె వాళ్ళను ఆపి, ''బాబూ, నా భర్తకు కొంచెం గంగాజలం ఉంటే ఇప్పించండి.'' అన్నది.

''మేమే, ఎక్కడినుంచో మోసుకు వస్తున్నాం. ఇంటికి పోవాలి. ఇది నీకు ఇచ్చేస్తే, మళ్ళీ మాకు ఎలా వస్తుంది!'' అన్నాడు నాగరాజు.

కాని కృష్ణయ్య తన పీపాను ఆమెకు ఇస్తూ, ''అమ్మా, దీన్ని మీ దగ్గిర ఉంచుకోండి. ఇందులో ఉన్నది పవిత్ర గంగా జలం,'' అన్నాడు.

ఆమె ఆ పీపాను తీసుకుని ముసలి వాడికి అందించింది. ఆయన ఆ గంగా జలాన్ని కొంచెం లోటాలో పోసుకుని తాగి, శక్తి వచ్చినట్టు వెంటనే లేచి నిలబడి, గుర్రం మీద ఉన్న కృష్ణయ్యను సమీపించి, నమస్కారం చేసి, ''అయ్యా, నీకు స్వాగతం. ఈ దినం మీరు మా ఇంటికి అతిథులుగా దయచెయ్యాలి. నా పేరు విశాలగుప్తుడు. మా ఇంటి వద్ద మీకు అన్ని విషయాలూ చెబుతాను,'' అని, నాగరాజు కేసి తిరిగి, ''మీరు కూడా రండి,'' అన్నాడు.

ఆశ్చర్యపోతూ కృష్ణయ్యా, నాగరాజూ విశాలగుప్తుడి వెంటవెళ్ళి, ఒక అందమైన భవనాన్ని చేరుకున్నారు. అక్కడ విశాలగుప్తుడి సేవకులు చాలామంది ఉన్నారు.

ఎన్. వి. ఆర్. సత్యనారాయణమూర్తి



విశాల గుప్తుడి. భార్యగా నటించిన మనిషి ఒక పరిచారిక అన్న సంగతి అక్కడ స్పష్టమయింది.

ఆ రాత్రి భోజనాలయాక విశాలగుప్తుడు కృష్ణయ్యతో ఇలా అన్నాడు:

''నా తండ్రి ధనగుప్తుడు వర్తకం చేసి అంతులేని ధనాన్నీ, రత్నాలనూ సంపాదించాడు. ఆయన చనిపోయేముందు, ప్రతి చైత్రపూర్ణిమనాడూ ఒక సజ్జనుడికి ఒక రత్నం ఇయ్యమని కోరాడు. నేను ఏటా ఏదో ఒక వేషం వేసుకుని ఆ రోజు ఒక సజ్జనుడి కోసం వెతుకుతూంటాను. ఈ ఏడు నాకు మీరు తటస్థపడ్డారు. రేపు మీరు బయలుదేరేటప్పుడు మీకు ఒక రత్నాన్ని ఇస్తాను. దాన్ని స్వీకరించి నన్ను ధన్యుణ్ణి చెయ్యాలి!''

అనుకోని ఈ అదృష్టానికి కృష్ణయ్య ఆశ్చర్యపోగా, కృష్ణయ్య అదృష్టాన్ని చూసి నాగరాజు ఈర్ష్య చెందాడు.

మర్నాడు బయలుదేరే ముందు విశాలగుప్తుడు ఒక రత్నం కృష్ణయ్యకు ఇచ్చి, ''మీరు సిద్ధిపురం వెళుతున్నారుగదా, దారిలో నాగపురంలో పఖ్‌రాజ్ అనే రత్నవర్తకుడున్నాడు. అతను మీకు దాని న్యాయమైన వెల ఇస్తాడు,'' అన్నాడు.

విశాలగుప్తుడి వద్ద సెలవు పుచ్చుకుని ఇద్దరూ బయలుదేరారు.

నాగరాజుకు ఆ రత్నాన్ని కాజెయ్యాలని తీవ్రమైన కోరిక కలిగింది. తామిద్దరూ దారిలో ఒక సత్రంలో బస చేసి ఉండగా నాగరాజు కృష్ణయ్య వద్ద ఉన్న రత్నాన్ని కాజేశాడు. రత్నం పోయిందని కృష్ణయ్య తెలుసుకుని తనతో చెప్పినప్పుడు నాగరాజు చాలా ఆశ్చర్యాన్ని కనబరచి, అది దొరికిన దాకా ఆ ఊరు వదలరాదన్నాడు.

''ఈ ఊళ్ళో మనకు ఎవరు సహాయపడతారు? అది ఎలా వచ్చిందో అలానే పోయింది!'' అన్నాడు కృష్ణయ్య.

తరవాత వాళ్ళు నాగపురం చేరారు. కృష్ణయ్య పఖ్‌రాజ్‌ను చూడబోదామన్నాడు.

"రత్నం కూడా పోయిందిగదా. ఇంకా ఆయనతో ఏం పని?" అన్నాడు నాగరాజు.

"విశాలగుప్తుడి స్నేహితం ఇతని పరిచయంతో పూర్తి అవుతుంది గదా! రత్నం అమ్మటానికే వెళ్లాలని ఏమిటి?" అన్నాడు కృష్ణయ్య.

"అయితే మీరు వెళ్లిరండి. ఈలోపుగా నేను ఊరు చూసి వస్తాను," అన్నాడు నాగరాజు.

అతను తాను దొంగిలించిన రత్నంతో ఒక రత్న వర్తకుడి వద్దకు వెళ్లి, "ఈ రత్నం మీరు ఎంతకు కొంటారు?" అని అడిగాడు.

అ వర్తకుడు దాన్ని చూస్తూనే, "ఇది మీకు ఎలా వచ్చింది?" అని అడిగాడు.

"మా తండ్రిగారు బోలెడు డబ్బు పోసి కొన్నారు. నాకు డబ్బు అవసరమై అమ్ముతున్నాను," అన్నాడు నాగరాజు.

వర్తకుడు నవ్వి, "మీ నాన్నగారిని ఎవరో బాగా మోసంచేశారు. ఇది గాజు ముక్క! చిల్లిగవ్వకు కూడా ఎవరూ దీన్ని కొనరు," అన్నాడు.

నాగరాజుకు ఒక విధంగా తృప్తి కలిగింది. విశాలగుప్తుడు కృష్ణయ్యను మోసగించాడు. తాను చేసినది దొంగతనమేగాని, విశాలగుప్తుడు కృష్ణయ్యకు చేసిన మోసం ఇంకా దారుణమైనది!



ఈ లోపల కృష్ణయ్య పఖ్‌రాజ్‌ను కలుసుకుని, తనకూ విశాలగుప్తుడికీ పరిచయం ఎలా అయినదీ చెప్పాడు.

వెంటనే పఖ్‌రాజ్ అతనితో, "మీరు విశాలగుప్తుడు ఇచ్చిన రత్నం నాకు ఇచ్చేసి, దాని విలువ తీసుకోండి," అన్నాడు.

"దాన్ని దారిలో ఎవరో దొంగిలించారు. నేను దాన్ని మీకు అమ్మటానికి రాలేదు. విశాలగుప్తుడుగారి మిత్రులని చూసి పోవచ్చాను," అన్నాడు కృష్ణయ్య. తనకు విశాలగుప్తుడు రత్నం ఇచ్చిన

సంగతి అతనికి ఎలా తెలిసిందా అని ఆశ్చర్యపడుతూ.

''మీ వెంట ఇంకొకరు కూడా ఉన్నారటగదా? ఆయన ఏడి?'' అని పఖ్‌రాజ్ ఆత్రంగా అడిగాడు.

''ఊరు చూస్తానని వెళ్ళాడు,'' అన్నాడు కృష్ణయ్య.

వెంటనే పఖ్‌రాజ్ తన మనుషులిద్దరిని పిలిచి, తమ భాషలో వాళ్ళకు ఏదో చెప్పాడు. వాళ్ళు వెంటనే బయలుదేరి వెళ్ళి, కొద్దిసేపట్లో నాగరాజును వెంటబెట్టుకు వచ్చారు.

పఖ్‌రాజ్ తన మనుషుల చేత నాగరాజును సోదాచేయించాడు. అతని వద్ద రత్నం దొరికింది.

''మీరు పోగొట్టుకున్న రత్నం ఇదేనా? విచారించకండి. ఇది గాజుపూస. ఇలాటివాడే మీ మిత్రుడు కూడా. ఇది అసలైన రత్నం అనుకుని దొంగిలించి, ఈ ఊళ్ళో ఉన్న రెండో రత్నవర్తకుడికి అమ్మజూపినట్టున్నాడు. అందుచేత, నా మనుషులకు దొరికిపోయాడు. మీకు విశాలగుప్తుడు ఇస్తానన్న అసలు రత్నం నా వద్దకు ముందేచేరింది. దానిమూల్యం ఇప్పుడు నేను మీకు ఇయ్యను. మీ ఊరికి పంపుతాను. కాని మీ మిత్రుణ్ణి న్యాయస్థానానికి పంపటం నా విధి,'' అన్నాడు పఖ్‌రాజ్ కృష్ణయ్యతో.

''అందుకు నేను ఒప్పుకోను. దారి పొడుగునా నాతో కష్టసుఖాలన్నీ పంచుకున్నాడు. పైగా అతను కాజేసినది గాజుపూస అని మీరే అన్నారు గద. నా రత్నంలో అతనికి సగం ఇయ్యబోతున్నాను. నామీద దయ ఉంచి, నా మిత్రుడి మీద దొంగతనం నేరం మోపకండి,'' అని కృష్ణయ్య పఖ్‌రాజ్‌ను వేడుకున్నాడు.

సిద్ధిపురం చేరగానే కృష్ణయ్యకు రత్నం విలువముట్టింది. అందులో సగం నాగరాజుకు ఇయ్యబోతే, ''నేను చేసిన దుర్మార్గానికి నన్ను ఖైదునుంచి కాపాడావు, అంతేచాలు,'' అన్నాడు నాగరాజు కృష్ణయ్యతో.






చంద్రయ్య జట్కా బండి తోలుకుని జీవించేవాడు. ఒక రోజు చీకటిపడి అతను ఇంటికి వెళ్ళిపోతూండగా, దారి పక్క నిలబడి ఉన్న ఒక మనిషి, ఊరికి ఆరుమైళ్ళ దూరంలో ఉన్న ఒక సత్రం వద్దకు బండి కట్టమని అడిగాడు. తెల్లవారే లోపుగా తిరిగి రావచ్చునని చెప్పిన మీదట చంద్రయ్య సరేనన్నాడు.

ఆ మనిషి తనతోపాటు వాసెనకట్టిన బిందెనూ, రెండు పలుగులనూ, పారలనూ బండిలో పెట్టుకున్నాడు. ఆ మనిషి పాడుబడిన సత్రంలో ఏదో నిధి తవ్వబోతున్నట్టు చంద్రయ్య ఊహించాడు.

బండి సత్రం చేరేసరికి చాలా పొద్దుపోయింది. బండిలో ఎక్కిన మనిషి బిందె దించేటప్పుడు అది కిందపడి, పెద్ద చప్పుడయింది. అందులో నుంచి చిల్లపెంకులు కొన్ని బయటికి వచ్చి ఉన్నాయి.

"ఈ రాత్రివేళ ఈ చిల్లపెంకుల బిందెను ఇక్కడికి ఎందుకు తెచ్చారు?" అని చంద్రయ్య ఆ పెద్దమనిషిని అడిగాడు.

"అంతా చెబుతాను. నాకు నీ సహాయం కావాలి," అంటూ ఆ పెద్దమనిషి ఇలా చెప్పాడు.

అతని పేరు వరహాలు. అతని తాత సముద్ర వర్తకం చేసి చాలా సంపాదించినవాడు. ఆయన ఒకసారి బోలెడు డబ్బుతో తిరిగి వస్తూ, అర్ధరాత్రి అయేసరికి ఈ సత్రంలోనే బస చేశాడు. ఆ రాత్రే ఆ సత్రం మీద బందిపోటు దొంగలు పడ్డారు. వాళ్ళు అడ్డం వచ్చిన వారినందరినీ చంపి, దొరికినదంతా దోచుకుని వెళ్ళిపోయారు. చచ్చిన వారిలో వరహాలు తాత కూడా ఉన్నాడు.

వరహాలు తండ్రి మళ్ళీ చిల్లర వ్యాపారంతో ప్రారంభించి, ఎలాగో వరహాలును

మాచిరాజు కామేశ్వరరావు



పెంచి పెద్దవాణ్ణి చేసి, చనిపోయాడు. తండ్రి పోయేనాటికి వరహాలుకు ఇల్లు తప్ప ఏమీ మిగలలేదు. ఆ ఇల్లు అమ్మేద్దామని, వరహాలు అటక మీద పాత సామానులు తీస్తుంటే, అతని తాత తాలూకు పుస్తకం ఒకటి కనబడింది. ఆ పుస్తకం కాగితాలు తిప్పుతూంటే ఒక చోట అతని తాత ఇలా రాసినట్టు కనబడింది: "సత్రాన్ని బందిపోటు చుట్టుముట్టారు. నా దగ్గిర ఉన్న డబ్బు అంతా పెట్టెతో సహా, కొత్తగా మొక్కల కోసం తవ్విన బోదెలో పూడ్చి పెట్టాను.''

ఈ మాట చెప్పి వరహాలు చంద్రయ్యతో, ''సత్రం వెనక ఉన్న చెట్ల కింద ఆ నిధి కోసం మనం తవ్వాలి. నువు నాకు సహాయపడినందుకు నీకు నిధిలో మూడోవంతు ఇస్తాను,'' అన్నాడు.

చంద్రయ్య అందుకు సంతోషంగా ఒప్పుకుంటూ, ''అయితే ఈ చిల్లపెంకుల బిందె దేనికి?'' అని అడిగాడు.

''ఉన్నట్టుండి మనం బిందె వెంట పెట్టుకువస్తే అందరికీ అనుమానం కలుగుతుంది. రోజూ ఇది మన వెంట ఉంటే ఎవరూ పట్టించుకోరు. పెట్టెలో డబ్బు ఇందులో పెట్టుకుపోవచ్చు. ఈలోగా ఎవరైనా అనుమానపడి బిందెను తణిఖీ చేస్తే ఇందులో చిల్లపెంకులు తప్ప ఏమీ ఉండవు!'' అన్నాడు వరహాలు.

చంద్రయ్య గుర్రాన్ని విప్పి ఒక చెట్టుకు కట్టేశాడు. తరవాత ఇద్దరూ చెరొక పలుగూ, పారా తీసుకుని సత్రం వెనక పక్కపోయి, చెట్ల పాదులన్నిటివద్దా చెరొక వైపు నుంచీ తవ్వి చూడటానికి ఉపక్రమించారు.

తెల్లవార వస్తున్నదనగా వాళ్ళు విరమించి, మర్నాడు రాత్రి మళ్ళీ రావటానికి తీర్మానించుకున్నారు. ఆ రాత్రి వారి ప్రయాసకు ఫలితం లేకపోయింది. గోతులు మళ్ళీ పూడ్చి, పలుగులూ, పారలూ ఒక పొదలో దాచి, ఇద్దరూ బండి ఎక్కారు.

చంద్రయ్య వరహాలును అతని ఇంటి వద్ద దించి తన ఇల్లు చేరుకున్నాడు.

"రాత్రంతా ఎక్కడ ఉన్నావు?" అని చంద్రయ్యను అతని భార్య కామాక్షి నిలవదీసి అడిగింది.

చంద్రయ్య భార్యకు జరిగినదంతా చెప్పి, "మళ్ళీ ఎక్కడా అనకు. నేను మళ్ళీ సాయంత్రం వెళ్ళి మరికొన్ని చెట్ల దగ్గిర తవ్వుతాను. నిధి మన అదృష్టం కొద్దీ నేను తవ్వే పక్క ఉంటే, దాన్ని మనమే ఉంచేసుకోవచ్చు." అన్నాడు.

"అన్యాయం! మనకు అన్యాయపు సొమ్ము వద్దు!" అన్నది కామాక్షి.



కాని చంద్రయ్య భార్యమాట విని పించుకోకుండా, సాయంత్రం వేళ, పాడు బడిన సత్రంచేరి, కొన్ని చెట్ల మొదళ్ల దగ్గిర తవ్వి, ఏమీ దొరక్క, ఆ గోతులను మళ్ళీ పూడ్చి ఇంటికి చేరాడు.

ఆ రాత్రి మళ్లీ వరహాలూ, చంద్రయ్యా సత్రం వెనక తవ్వారు. ఇలా రెండు వారాలపాటు ఇద్దరూ శ్రమపడ్డారు. అయితే చంద్రయ్య నిద్రాహారాలు సరిగాలేక, పగలూ, రాత్రీకూడా శ్రమపడి, ఢీలా అయిపోయాడు. మర్నాడు ఉదయానికి అతనికి జ్వరం కూడా తగిలింది.

"ఈ రాత్రికి నేను బండి కట్టలేను," అని చంద్రయ్య పొరుగింటి పుల్లయ్య ద్వారా ఆ సాయంత్రం వరహాలుకు కబురు పంపాడు.

పుల్లయ్య తిరిగివచ్చి, వరహాలు ఇల్లు ఖాళీచేసి పట్నం వెళ్ళాడని చంద్రయ్యకు తెలిపాడు. చంద్రయ్య తల తిరిగి పోయింది. వరహాలు సకుటుంబంగా పట్నం వెళ్ళాడంటే అతనికి నిధి దొరికిందన్న మాట! కిందటి రాత్రి వాళ్ళు తిరిగి వచ్చినప్పుడు బిందెలో చిల్లపెంకులకు బదులు ధనం ఉన్నదన్న మాట! తనను వరహాలు ఎంత మోసం చేశాడు!

తాను వరహాలును మోసం చెయ్య జూసిన సంగతి ఆ క్షణంలో చంద్రయ్యకు గుర్తు రాలేదు. వరహాలు ఎక్కడికి వెళ్లాడో

తెలుసుకుంటానని కేకలు పెట్టుతూ అంత జ్వరంతోనూ చంద్రయ్య వరహాలు ఇంటికి పడుతూ, లేస్తూ బయలుదేరాడు.

వరహాలు ఇల్లు తాళం పెట్టి ఉన్నది. పక్క ఇంటి అరుగుమీద కూర్చుని ఉన్న ముసలివాణ్ణి అడిగితే, "పిచ్చి బాగా ముదిరిపోయింది. వైద్యానికి పట్నం తీసుకుపోయారు," అన్నాడు.

చంద్రయ్య నిర్ఘాంతపోయి, "వరహాలుకు పిచ్చా?" అని అడిగాడు.

"కాదామరి?? తాత నిధి దాచాడని ఇల్లంతా తవ్వేశాడు! ఈ పిచ్చితో వ్యాపారం కూడా మానేశాడు! చివరకు ఒక బిందె దొరికిందిలే! అందులో చిల్ల పెంకులు తప్ప ఏమీలేవు! రాను రాను పిచ్చి మరీ ముదిరింది. అతని భార్య అతన్ని పట్నం తీసుకుపోయింది," అన్నాడు ముసలివాడు.

చంద్రయ్యకు అంతా అర్థమయింది. ఆ పిచ్చివాణ్ణి నమ్మి తాను కూడా గోతిలో పడ్డాడు! ఆ వరహాలు పిచ్చే తనకూ అంటింది! డబ్బు ఎంతటి వాణ్ణయినా పిచ్చివాణ్ణి చేస్తుంది!

చంద్రయ్య, మనస్సు తేలికపడి, కాళ్లీడ్చుకుంటూ ఇంటికి బయలుదేరాడు.

అంతదాకా స్తంభం చాటున ఉన్న కామాక్షి ఇవతలికి వచ్చి, "క్షమించు, తాతా! నీ చేత అబద్ధం చెప్పించాను," అన్నది.

"అవునూ? వరహాలుకు నిధి దొరికి, అప్పులు తీర్చి, పట్నం వెళ్ళిపోయాడు గదా? అతనికి పిచ్చి అని ఎందుకు చెప్పమన్నావూ?" అన్నాడు తాత.

కామాక్షి తాతకు జరిగినదంతా చెప్పి, "అలా చెప్పకపోతే నా మొగుడికి నిజంగా పిచ్చి పట్టుకునేది! ఈ నిధి గొడవ వచ్చినదాకా తాను సంపాదించే దానితో మేం సుఖంగానూ, శాంతంగానూ బతుకుతున్నాం. అటువంటివాడికి నిధి దాహం పుట్టితే మాకు సుఖం ఉంటుందా?" అని చెప్పి, మరో దారిన వేగంగా ఇంటికి బయలుదేరింది.



# సగం ధర్మప్రభువు

ఒకనాడు జయసింహు డనే రాజు దర్బారులోకి ఒక పేదవాడు వచ్చి, తన దీనస్థితి చెప్పుకుని బతుకుతెరువు చూపమని ప్రార్థేయపడ్డాడు. రాజు అతనికి కొంత బంజరుభూమి ఇప్పించాడు.

తరవాత ఒకనాటి రాత్రి రాజూ, మంత్రీ మారువేషాలలో తిరుగుతూ ఆ పేదవాడి ఇంటి ప్రాంతానికి వచ్చి, అరుబయట మంచం మీద కూర్చుని ఉన్న అతన్ని పలకరించారు. అతను మర్యాదగా వారిని తన మంచం మీద కూర్చోబెట్టి మంచీ, చెడ్డా మాట్లాడాడు.

"ఈ దేశపు రాజుగారి నుంచి సహాయం పొందాలనుకుంటున్నాం. ఆయన ఎటువంటి వాడు?" అని మంత్రి అతన్ని అడిగాడు.

అతను రాజుగారు తనకు చేసిన సహాయం గురించి వివరంగా చెప్పి, "రాజుగారు సగం ధర్మప్రభువు!" అన్నాడు.

"నీకు బతుకుతెరువు చూపించిన రాజును సగం ధర్మప్రభువు అన్నావేం?" అని మంత్రి అతన్ని అడిగాడు.

"అయ్యా, నేను సాహసించి రాజుగారి దర్బారుకు పోయి, నా గోడు చెప్పుకుని, ఆయనకు నా కష్టం అర్థం అయేటట్టు చేసుకోగలిగాను గనక గదా ఆయన నాకు పొలం ఇచ్చాడు. నాలాటి కటికదరిద్రులు దేశంలో ఎందరు లేరు? వారందరికీ రాజుగారి ఎదటపడే ధైర్యం ఉంటుందా? తమ కష్టాలు చెప్పుకునే శక్తి ఉంటుందా? రాజుగారు పూర్తి ధర్మప్రభువైతే వారి కష్టాలూ తానే తెలుసుకుని, సాగు లేకుండా పడి ఉన్న భూములను దానం చెయ్యవచ్చు గదా!" అన్నాడు ఆ మనిషి.

వారం తిరిగేలోగా రాజుగారు అనేక వేలమంది కటికదరిద్రులకు భూదానం చేశాడు.

48

—సుకమంచి బ్రహ్మాజీరావు






మహదేవపురంలో ఉన్న కొద్దిమంది వ్యాపారస్థులలో శంకరయ్య కల్తీ వ్యాపారం చేస్తూ కూడా, తన వాక్చాతుర్యంతో సామాన్యులను తేలికగా నమ్మించి, మంచి లాభాలు గడించాడు. అతని నిజాయితీని ఎవరూ శంకించేవారు కారు. దారితప్పి ఎవరైనా శంకించినా శంకరయ్య తన మాటకారితనంతో వాళ్ళే పొరపాటు పడి ఉంటారన్న అనుమానం వారిలో రేకెత్తించేవాడు.

శంకరయ్య కల్తీ వ్యాపారం చేస్తూ ఉండి ఉండవచ్చునని మునసబు శివయ్యకు అస్పష్టమైన ఆధారాలు అప్పుడప్పుడూ పొడగట్టుతూ వచ్చాయి. నిజం తెలుసుకోవటానికి ఆయన తగిన ఉపాయం కోసం ఆలోచించసాగాడు.

చివరకు ఒకనాడు మునసబు శివయ్య నెయ్యి కొంటానంటూ శంకరయ్య కొట్టుకు వచ్చాడు. శంకరయ్య లోపలికి వెళ్ళి, నేతిలో ముంచి తీసిన మూడు వేళ్ళతో తిరిగివచ్చి, శివయ్యకు ఒక్కొక్క వేలే చూపిస్తూ, ''ఇదుగోనండీ! ఈ రకం నెయ్యి అప్పటం ఆవునెయ్యి! నా వద్ద ఉన్న అసలైన, సిసలైన మొదటిరకం! ఇది రెండవరకం; మొదటిదానంత శ్రేష్ఠం కాకపోయినప్పటికీ, ఇతరుల వద్ద దొరికే మొదటిరకానికి ఏమాత్రమూ తీసిపోదు. ఇక మూడోరకం గురించి ప్రత్యేకంగా చెప్పేదే లేదు. తక్కువ ధరలో మంచి రకం కావాలనుకునేవారి కోసం ఉంచాం. ఇంతకూ తమకు ఏ రకం ఇయ్యమంటారు?'' అని అడిగాడు.

మూడురకాలనూ పరిశీలించిన మునసబు శివయ్య వాటి మధ్య తేడా ఏమీ లేదని తెలుసుకోవటమేగాక, శంకరయ్య చెప్పే ధర కూడా దుబారాగా ఉన్నదని

కె. బి. దత్తా

గ్రహించి, ఆ మాటే శంకరయ్యను అడిగాడు.

"అదేమిటండీ? మూడురకాల నెయ్యీ మూడు వేరువేరు పాత్రలలో ఉంచాను. అనుమానమైతే తమరు లోపలికి వచ్చి, స్వయంగా చూడవచ్చు," అన్నాడు శంకరయ్య ధీమాగా.

చీకటిగానూ, కాలు మోపటానికి వీలు లేకుండానూ ఉండే సరుకుల కొట్టులోకి మునసబు ఎలాగూ రాడని అతని ధైర్యం.

"అబ్బే! ఇన్ని ఏళ్ళుగా ఈ ఊళ్ళో వ్యాపారం చేస్తున్నావు, నీ మీద అనుమానమేమిటి, శంకరయ్యా?" అని, మునసబు శివయ్య మూడోరకం నెయ్యి కొంత ఖరీదు చేసి వెళ్ళిపోయాడు.

నిజానికి శంకరయ్య వద్ద ఉన్నది ఒకే రకం నెయ్యి. ఆ నేతినే అతను మూడు రకాలుగా చూపించి, కొనుగోలుదారు అందులో ఏ రకం కొన్నా తన గరిష్ఠ లాభానికి ఏ లోటూ రాకుండా ధరలు నిర్ణయించేవాడు.

ఈ మోసం తెలియని కారణంచేత, గ్రామప్రజలు ఎవరూ శంకరయ్య నిజాయితీని శంకించేవాళ్ళు కాదు.

మర్నాడు శంకరయ్య మునసబు శివయ్య వద్దకు హడావుడిగా వచ్చి, "మునసబుగారూ, నిన్నటి రాత్రి నా దుకాణంలో దొంగతనం జరిగిందండీ! దయచేసి, తమరు ఎలాగైనా దొంగను పట్టుకుని, పోయిన సరుకు తిరిగి దొరికేలా



చేయండి,'' అంటూ కంగారుగా విన్నవించు కున్నాడు.

''సరే, అసలైన దొంగను పట్టడానికి ప్రయత్నిస్తాను! ఇంతకూ ఏయే వస్తువులు పోయినవీ చెప్పావుకావు.'' అన్నాడు శివయ్య.

''ఒక బియ్యం బస్తా, ఒక కందిపప్పు బస్తా, ఒక నేతిపాత్రా, కొన్ని తూనిక రాళ్ళూ పోయాయండీ! తమరు ఎలాగైనా అవి నాకు తిరిగి వచ్చేటట్టు చూడాలి!'' అని శంకరయ్య ప్రాథేయపడ్డాడు.

''దుకాణంలోని మిగిలిన సరుకంతా ఉన్నట్టేనా?'' అని మునసబు శంకరయ్యను అడిగాడు.

''మిగిలిన సరుకంతా ఉన్నచోటనే ఉన్నదండీ! తమరు ఒకసారి దుకాణం వద్దకు వచ్చి పరిశీలించండి,'' అని శంకరయ్య మునసబు శివయ్యను ఆహ్వానించాడు.

శివయ్య శంకరయ్య దుకాణానికి వెళ్లి, సరుకులన్నిటినీ పరిశీలిస్తూ, ''నీ కొట్టులో మూడు నేతిపాత్రలు ఉన్నట్టు నిన్న నాతో అన్నావు గదా! ఒకటి దొంగలు ఎత్తుకు పోతే మిగిలిన రెండూ ఏవీ? కనిపించటం లేదే!'' అన్నాడు.

శంకరయ్య గొంతులో పచ్చివెలక్కాయ పడినట్టు అయింది. అతను ఏదో చెప్ప బోయాడు గాని, మునసబు అడ్డువచ్చి, ''శంకరయ్యా, అందరినీ ఎంతకాలమని మోసగించగలవు? నీ మీద అనుమానం కలిగి, గ్రామాధికారి హోదాలో, నిన్న రాత్రి, నీ కొట్టులోని సరుకు కొంత తీయించి, పంచాయితీ గిడ్డంగిలో పెట్టించాను. బియ్యమూ, కందిపప్పూ కూడా కల్తీచేయడమే కాక, తూనిక, కొలతలలో కూడా నువు ఉళ్లోవాళ్ళందర్నీ మోసం చేస్తున్నట్టు రుజువయింది. నీ మోసానికి శిక్షగా పన్నెండువందల రూపాయల జరిమానా విధిస్తున్నాను. ఆ మొత్తం చెల్లించు. నువు ఇక ఈ ఊళ్లో వ్యాపారం చేసుకోరాదు,'' అని శివయ్య వెళ్ళి పోయాడు.





# దేవీ భాగవతం

ఇంద్రుణ్ణి నిర్మూలించమని త్వష్ట చెప్పిన మీదట వృత్రుడు రథం ఎక్కి, గొప్ప సేనను వెంట బెట్టుకుని, యుద్ధానికి బయలుదేరాడు. ఇంద్రుడు మరొకసారి వృత్రుడితో యుద్ధం చెయ్యటానికి సిద్ధపడ్డాడు.

ఇంద్రుడికీ, వృత్రుడికీ గొప్ప యుద్ధం జరిగింది. ఇద్దరూ పోరాడారు. చూసి, చూసి వృత్రుడు ఇంద్రుణ్ణి పట్టుకుని తన నోట్లో పెట్టుకున్నాడు.

అది చూసి దేవతలు ఆక్రోశిస్తూ, ఇంద్రుడి విముక్తికి మార్గం చెప్పమని బృహస్పతిని అడిగారు.

"నేను మాత్రం ఏం చెయ్యగలను? ఇంద్రుడు చావలేదు. ఆ వృత్రుడి నోట్లో ప్రాణాలతోనే ఉన్నాడు," అన్నాడు బృహస్పతి.

అప్పుడు దేవతలు కూడబలుక్కుని, జృంభిక అనే శక్తిని సృష్టించారు. ఆ శక్తి వృత్రుణ్ణి ఆవహించి, అతనికి ఆవలింత తెప్పించింది. వృత్రుడు నోరు తెరవగానే ఇంద్రుడు బయటికి దూకాడు.

యుద్ధం చాలా దీర్ఘకాలం సాగిన మీదట ఇంద్రుడు పూర్తిగా ఓడి, దిక్కు లేని వాడయాడు. వృత్రుడు అమరావతికి వచ్చి, అక్కడి సకల సంపదలనూ స్వాధీనం చేసుకున్నాడు.

తన కొడుకు స్వర్గానికి రాజు కావటం చూసి త్వష్ట ఎంతో సంతోషించాడు. దేవతలు యజ్ఞభాగాలు పోగొట్టుకుని,

18. వృత్రుడి వధ



చెట్టులూ, పుట్టలూ పట్టిపోయారు. దేవ
నగరం రాక్షసనగరమయింది.

దేవతలు వెళ్ళి శివుడికి తమ గోడు
చెప్పుకున్నాడు.

"తమ శరణు జొచ్చాం. మమ్మల్ని
కాపాడాలి," అన్నారు వాళ్ళు.

శివుడు మామూలు ధోరణిలో దేవత
లతో, "మనం బ్రహ్మను వెంటబెట్టుకుని
విష్ణువు వద్దకు పోదాం. అతనే వృత్రుణ్ణి
చంపుతాడు," అన్నాడు.

ఇంకేం? అందరూ కలిసి వైకుంఠానికి
వెళ్ళారు. విష్ణువు వారికి దర్శనం ఇచ్చి,
"మీరంతా ఇలా వచ్చారు. ఏమిటి
విశేషం?" అని అడిగాడు.

అందరూ విచారంగా ఉండటం చూసి
విష్ణువే మళ్ళీ, "మీకు వచ్చిన కష్ట
మేమిటో చెప్పితే దానికి తగిన పరిష్కారం
చేస్తాను," అన్నాడు.

దేవతలు తమ కష్టం చెప్పుకున్నారు.
వారితో విష్ణువు ఇలా అన్నాడు:

"అవును, మీకు వచ్చిన కష్టం నాకు
తెలుసు. వృత్రుణ్ణి ఏ మోసంతోనైనా
చంపే ఉపాయం ఆలోచించి మీకు చెబు
తాను. బ్రహ్మ నుంచి పొందిన వరాలతో
ఎవరివల్లా చావులేక, మదించి, నిరం
కుశుడుగా ప్రవర్తిస్తున్నాడు వృత్రుడు.
మీరు వృత్రుడికీ, ఇంద్రుడికీ స్నేహం
కలిగించండి. నేను వజ్రాయుధంలో
అదృశ్యంగా ఉండి మీకు సహాయపడ
తాను. మీలాటి కపటంతో వాణ్ణి స్నేహానికి
ఒప్పించటం సాధ్యం అవుతుందో అలాటి
కపటాన్ని ప్రయోగించండి. ఎలాగైనా
వాణ్ణి నమ్మించండి. తరవాత ఇంద్రుడు
యుక్తిగా వాణ్ణి చంపేస్తాడు. నేను లోగడ
మోసాలు చెయ్యలేదా? వామనుడి
రూపంలో వెళ్ళి బలిని మోసగించలేదా!
మోహినీరూపంలో దానవులను మోసగించ
లేదా? అది అలా ఉంచి, సమస్త
కోరికలూ తీర్చగల జగజ్జననిని ప్రార్థించి
నట్టయితే, ఆమె తన యోగమాయతో
సహాయపడుతుంది. ఆమె మాయకు

లోబడి వృత్రుడు ఇంద్రుడి చేతిలో చస్తాడు. మీరు కూడా ఆమె సహాయంతో వృత్రుణ్ణి చంపండి."

దేవతలు కల్పవృక్షాలతో కూడిన మేరు పర్వతం మీదికి వెళ్ళి, మహాదేవిని ధ్యానించారు. వాళ్ళు మహాదేవి తమకు లోగడ సహాయపడి, మహిషాసురుణ్ణీ, శుంభ నిశుంభులనూ, ఇతర రాక్షసులనూ ఎలా చంపినదీ చెప్పి, "తల్లీ, ఈ వృత్రుడు నీకు కూడా శత్రువే అయి ఉండాలి. లేకపోతే, నీ భక్తులమైన మమ్మల్ని ఇలా ఎందుకు హింసలపాలు చేస్తాడు?" అన్నారు.



వారి పొగడ్తలకు సంతోషించి దేవి ఆభరణాలతో, మూడు కళ్ళతో, నాలుగు చేతులతో, దివ్యమైన ఆయుధాలతో రక్త చందనం రంగుగల వస్త్రాలు ధరించి, వారి ఎదట ప్రత్యక్షమయింది.

ఆమె వారికి సహాయం చేస్తానని మాట ఇచ్చి అంతర్ధానమయింది. దేవతలు కూడా తృప్తిపడి తిరిగి వచ్చి, ఇంద్రుడితో స్నేహానికి ఒప్పించటానికి మునులను వృత్రుడి వద్దకు పంపారు.

మునులు వృత్రుడి వద్దకు వెళ్ళి ఇలా అన్నారు:

"వృత్రా! నువు మహాయోగ్యుడవు. ఇంద్రుడు కూడా గొప్పవాడు అనిపించుకున్నవాడే. అలాటప్పుడు మీ రిద్దరూ స్నేహంగా ఉంటే వేరే చెప్పాలా? ఇంద్రుడు నీతో స్నేహప్రమాణం చేస్తాడు. నువు కూడా అలాగే చెయ్యి. మునులు మీకు మధ్యవర్తులుగా ఉంటారు."

దానికి వృత్రుడు, "మీరంటే నాకు చాలా గౌరవం. మీ మాట తీసివేయటానికి వీల్లేదు. అయితే పాపాత్ముడూ, బ్రహ్మహంతకుడూ అయిన ఇంద్రుణ్ణి, ఎలా నమ్ముతాను?" అన్నాడు.

దానికి మునులు, "ఎవడి ద్రోహం వాణ్ణే కట్టికుడుపుతుంది. బ్రహ్మహత్యాపాతకానికీ, కల్లు తాగిన పాపానికీ ప్రాయశ్చిత్తం ఉన్నది. కాని మిత్ర



ద్రోహానికి ప్రాయశ్చిత్తం లేదే! అందుచేత నువ్వూ, ఇంద్రుడూ ప్రమాణపూర్వకంగా స్నేహం చేసుకోవచ్చు." అన్నారు.

"తడి దానితోగాని, పొడి దానితోగాని, రాతితోగాని, కర్రతోగాని, కఠినమైన వజ్రంతోగాని, పగలుగాని, రాత్రిగాని దేవతలూ, వారి అధిపతి అయిన ఇంద్రుడూ నన్ను చంపకూడదు. ఇందుకు అభ్యంతరం లేకపోతే, మీరు కోరినట్టు చేయగలను," అన్నాడు వృత్రుడు.

మునులు ఈ మాట తీసుకుపోయి ఇంద్రుడితో చెబితే అతను సరేనన్నాడు. ఇంద్రుడు వృత్రుడి నియమానికి అగ్ని సాక్షిగా ఒప్పుకున్నానన్నమీదట. ఆ మాట నమ్మి వృత్రుడు ఇంద్రుడితో స్నేహం చేశాడు.

ఇద్దరూ స్నేహంగా కలిసి తిరిగారు. సముద్రతీరానా, నందనవనం లోనూ సంచరించారు. వృత్రుడు తృప్తిపడ్డాడు, కాని ఇంద్రుడు మాత్రం వృత్రుణ్ణి చంపే అవకాశం కోసం ఆత్రంగా ఎదురు చూస్తున్నాడు.

తన కొడుకు ఇంద్రుడితో స్నేహం చేసినట్టు విని త్వష్ట అమితాశ్చర్యంతో కొడుకును చూడవచ్చి ఇలా అన్నాడు:

"నువు ఈ ఇంద్రుణ్ణి ఎలా నమ్మావు! అందరూ మనలాటివాళ్ళే అనుకోవటం పొరపాటు. ఎంత వెర్రివాడైనా శత్రువును నమ్ముతాడా? అందులోనూ అవకాశం దొరికితే నమ్మకద్రోహం చేసేవాడు ధర్మానికి కట్టుపడతాడా?"

ఈ ధోరణిలో తండ్రి ఎంత బోధించినా, కాలం మూడిన వృత్రుడి తల కెక్కలేదు.

ఒకనాటి సంధ్య వేళ ఇంద్రుడూ, వృత్రుడూ సముద్రతీరాన తిరుగుతున్నారు. అది రాత్రీ కాదు, పగలూ కాదు; అంతేగాక వృత్రుడు ఒంటరిగా ఉన్నాడు. అందుచేత ఇంద్రుడు వృత్రుణ్ణి చంపటానికి అదే అదను అనుకుని, విష్ణు

వును తలచుకున్నాడు. విష్ణువు వచ్చి, అదృశ్యంగా వజ్రాయుధంలో ప్రవేశించాడు. ఇంద్రుడికి సముద్రపు నురుగు కనిపించింది; అది తడిదీ కాదు, పొడిదీ కాదు; ఏ విధమైన ఆయుధమూ కాదు. ఇంద్రుడు దేవిని కూడా తలచుకున్నాడు. ఆమె తన అంశను ఆ నురుగులో ప్రవేశపెట్టింది. ఇంద్రుడు తన వజ్రాయుధాన్ని నురుగుతో కప్పి, వృత్రుడి మీద బలంగా విసిరాడు. ఆ దెబ్బతో వృత్రుడు కొండ విరిగిపడినట్టు పడి, అప్పటికప్పుడు ప్రాణాలు వదిలాడు.



శత్రుభయం తీరిపోయిన ఇంద్రుడు అమరావతికి తిరిగివచ్చి, మునుల నుంచి స్తోత్రాలు పొందుతూ, మహాదేవికి ఉత్సవం చేయించి, నందనోద్యానంలో రత్నమయమైన ఆలయాన్ని దేవికి కట్టించి, ప్రతిష్ఠించాడు. తరవాత అతను తనకు సహాయపడిన విష్ణువును దేవతలందరితో కలిసి పూజించాడు. వృత్రుణ్ణి చంపినది దేవీ, విష్ణువూ, ఇంద్రుడూ అయినా, కీర్తి ఇంద్రుడికే వచ్చింది. విష్ణువు వెళ్ళిపోయాడు.

అయితే ఇంద్రుడికి మిత్రద్రోహం చేశానన్న భయం పట్టుకున్నది. ఈ పాతకంలో తమకూ, విష్ణువుకూ కూడా భాగం ఉన్నందుకు మునులు కూడా భయపడ్డారు. జరిగినదానికి పశ్చాత్తాప పడుతూ మునులు తమ తమ ఆశ్రమాలకు వెళ్ళిపోయారు.

తన కొడుకు మరొకడు పోయినందుకు త్వష్ట విచారపడి, కొడుక్కు ఉత్తర క్రియలు జరిపి, మోసంతో వృత్రుణ్ణి చంపినందుకు ఇంద్రుణ్ణి కష్టాల పాలు కమ్మని శపించాడు.

పాపం కట్టి కుడుపుతుంది. వృత్రుణ్ణి చంపిన అనంతరం ఇంద్రుడి తేజస్సు తగ్గిపోయింది. ''ఇంద్రుడు కృతఘ్నుడు,'' అంటూ దేవతలు వెటకారంగా మాట్లాడసాగారు. ప్రమాణాలన్నిటినీ గాలికి వదిలి, మిత్రఘాతకుడు కావటంలో ఇంద్రుడికి



సమమైనవాడు మూడు లోకాలలోనూ లేడని చెప్పుకున్నారు. మనుషులలో కూడా ఇంద్రుడికి అపఖ్యాతి వచ్చింది.

ఇంద్రుడు సభలో తన ముఖం చూపలేక, కుములుతూ ఇంట్లో కూర్చున్నప్పుడు, అతని భార్య అతనితో, ''శత్రువు భయం తీరి కూడా సుఖంగా లేవెందుచేత? అలాటి శత్రువు మరెవ్వడూ లేడు గదా?'' అని అడిగింది.

ఇంద్రుడు శచితో, ''నా కిప్పుడు పట్టుకున్నది శత్రుభయం కాదు, బ్రహ్మహత్యాభయం! నందనవనమూ, అమృతమూ, గంధర్వగానమూ, అప్సరల నృత్యాలూ, సుధా, ఇతర స్త్రీలూ, కామధేనువూ, కల్పవృక్షమూ, ఏదీ నా కిప్పుడు సుఖం కలిగించదు!'' అన్నాడు.

ఇలా అని ఇంద్రుడు మానససరస్సు వద్దకు పోయి, ఎవరికీ కనబడకుండా ఒక తామరతూడులో ప్రవేశించి, నీటిపాములాగా నీటిలో సంచరించసాగాడు.

ప్రపంచం అరాజకమయింది. ఆ స్థితి నివారించటానికి దేవతలూ, మునులూ కలిసి ఆలోచించి, ఇంద్రపదవికి నహుషుణ్ణి తెచ్చారు. స్వతహాగా మహాధర్మాత్ముడైనా, అధికారమదం తలకెక్కి నహుషుడు స్త్రీలోలుడైపోయాడు. శచీదేవి చాలా అందగత్తె అని అతనికి తెలిసింది. అతను ఋషులను పిలిచి, ''ఇప్పుడు నేను దేవతల రాజును గదా! నన్ను కొలవటానికి ఇంద్రుడి భార్య రాదేం? ఆమెను పిలిపించండి,'' అన్నాడు.

ఈ మాటకు కలవరపడి, ఋషులు వెళ్ళి శచీదేవితో నహుషుడి మాటలు చెప్పారు. ఆమె బృహస్పతితో తనను నహుషుడి నుంచి కాపాడమన్నది. బృహస్పతి ఆమెకు అభయం ఇచ్చాడు. కాని మునులు ఆమెను ఇంద్రుడి వద్దకు తీసుకుపోకుండా ఉండటానికి భయపడ్డారు. బృహస్పతి ఆమెకు ఒక ఆలోచన చెప్పి, ఆమెను మునుల వెంట నహుషుడి వద్దకు పంపాడు.

శచి నహుషుడితో, ''నా భర్త జాడ తెలిస్తేగాని నేను నీకు భార్యను కాలేను. ఆయన సంగతి తెలిసినదాకా ఆగు,'' అన్నది.

నహుషుడు సరేనన్నాడు. ఆమె తరఫున దేవతలు విష్ణుమూర్తి వద్దకు పోయి, ఇంద్రుడు ఎక్కడ ఉన్నాడని అడిగారు.

''మీరు అశ్వమేధయాగం చేసి జగదంబను తృప్తిపరచినట్టయితే, ఇంద్రుడు తిరిగి మీకు రాజవుతాడు. శచి తన భర్తను తిరిగి పొందుతుంది,'' అన్నాడు విష్ణువు.

దేవతలు ఇంద్రుడి జాడ తెలుసుకుని, అతనిచేత అశ్వమేధం చేయించారు. అయినా అతను తిరిగి రాకపోవటానికి శచి విచారించి, బృహస్పతిని కారణం అడిగింది. ఆయన ఆమెను దేవిని ఆరాధించమన్నాడు. ఆమె అలాగే చేసింది. దేవి ప్రత్యక్షమై, తన మాయచేత నహుషుడు చావబోతున్నాడని చెప్పి, శచి ఇంద్రుడి వద్దకు వెళ్ళే ఏర్పాటు చేసింది.

శచి ఇంద్రుణ్ణి చేరి జరిగినదంతా చెప్పి, నహుషుడు తనను కోరుతున్నట్టు తెలిపింది. ఇంద్రుడు, ''ఋషులు మోసే వాహనంలో నహుషుణ్ణి నీ వద్దకు రమ్మను. ఆ సమయంలో, ఆ కామాంధుడు ఋషుల శాపానికి గురి అవుతాడు,'' అని శచికి సలహా ఇచ్చాడు.

ఆ ఎత్తు పారింది. శచీదేవిని తన భార్యను చేసుకునేటందుకు, తన వాహనాన్ని సప్తర్షులు మోయాలనీ, ఇతర ఋషులు వెంట రావాలనీ నహుషుడు కోరాడు. వాళ్ళు అందుకు కూడా ఒప్పుకున్నారు. అయితే వాళ్ళు వేగంగా నడవటంలేదని, ''సర్ప, సర్ప! '' అంటూ అగస్త్యుణ్ణి కాలితో తన్నాడు.

అగస్త్యుడు అతన్ని, ''నువే సర్పంకా!'' అని శపించాడు. ఆ శాపంతో నహుషుడు పాము రూపం పొంది, స్వర్గం నుంచి భూమి మీద పడ్డాడు.

ఈ విధంగా ఇంద్రుడు తిరిగి స్వర్గాధిపతి అయాడు.






పరంధామయ్య ఆకస్మికంగా మరణించ టంతో అతని భార్యా, పదేళ్ళ కొడుకు గోపాలుడూ అనాథలైపోయారు. వారికి వెనకా, ముందూ ఎవరూ లేరు. వారికి ఉన్నదల్లా ఒక ఇల్లూ, ఒక ఎకరం పొలమూనూ.

పరంధామయ్య పొలం ధనంజయుడనే భూస్వామి పొలాన్ని చేరి ఉన్నది. పరంధామయ్య బతికినంత కాలమూ అతని రెక్కల కష్టంతో బతికిన పరంధామయ్య భార్య ఇప్పుడు నిస్సహాయురాలు కావటంచేత, ధనంజయుడు ఆమెకున్న ఎకరం పొలానికి మామూలుకన్న ఎక్కువ ధర ఇస్తానని మాట ఇచ్చి, దాన్ని తన పొలంలో కలిపేసుకున్నాడు.

"నీ పొలం తాలూకు డబ్బు నా వద్దనే ఉండనియ్యి. ఆ డబ్బును వడ్డీకి తిప్పి, నీ కెప్పుడు కావాలంటే అప్పుడిస్తాను. ఈలోగా నీ కొడుకు పెద్దవాడవుతాడు. డబ్బు నీ దగ్గిర ఉంటే నిన్ను అందరూ మోసంచేస్తారు," అన్నాడు ధనంజయుడు.

పరంధామయ్య భార్య ఈ మాటలు నమ్మి, డబ్బు ధనంజయుడి వద్దనే ఉండనిచ్చి, తన శరీరకష్టంతో కొడుకును చదివించింది. కాలక్రమాన గోపాలుడు పెద్దవాడై బస్తీకి పోయి, పెద్దచదువులు చదవాలనుకున్నాడు. అందుకు డబ్బు అవసరం గనక పరంధామయ్య భార్య ధనంజయుణ్ణి డబ్బు అడిగింది.

"నీ డబ్బేమన్నా నా దగ్గిర దాచబెట్టావా? నీ కెందుకు డబ్బు ఇయ్యాలి?" అని ధనంజయుడు ఆమెను అడిగాడు.

పరంధామయ్య భార్య నిర్ఘాంతపోయింది. ఎవరో ఆమెకు చేస్తారన్న అన్యాయం ధనంజయుడే చేశాడు! ఆమెకు మతిపోతున్నట్టు అనిపించింది.

బొమ్మిడి అచ్చారావు



ఆమె ధనంజయుణ్ణి ఎన్నో రకాలుగా బతిమాలి భంగపడింది.

ఈ విషయం తెలిసి గోపాలుడు కోపంతో చిందులు తొక్కాడు.

''అసలు వీణ్ణి నమ్మి డబ్బు దాచుకోవటం మనదే పొరపాటు! వీడికి సరి అయిన గుణపాఠం నేర్పాలి,'' అన్నాడు వాడు తల్లితో.

గోపాలుడికి అనంతు డనే స్నేహితుడు ఉన్నాడు. అనంతుడి తండ్రి స్వర్ణకారుడు. అతనికి మంచి పేరున్నది. గోపాలుడు జరిగినదంతా అనంతుడి తండ్రికి చెప్పి, అతని వద్ద కొన్ని పాత బంగారు నగలు తీసుకున్నాడు.

ప్రతిరోజూ సాయంకాలంవేళ ధనంజయుడి వద్దకు ఊళ్ళోని పెద్దలు వచ్చి లోకాభిరామాయణం మాట్లాడుతూ ఉంటారు. అలా పదిమంది ఉన్న సమయంలో గోపాలుడు నగలతో సహా ధనంజయుడి ఇంటికి వచ్చాడు.

ధనంజయుడు గోపాలుణ్ణి చూసి కంగారుపడ్డాడు, పదిమందిలోనూ డబ్బు విషయం అడిగి తనని అల్లరిపెడతాడేమోనని! కాని గోపాలుడు ఆ సంగతే ఎత్తక, తనతో తెచ్చిన నగలు, ఊరి పెద్దలందరూ చూస్తూండగా, ధనంజయుడి ముందుపెట్టి, ''ఇవి మా తల్లిగారి పాత నగలు. నాకు డబ్బు అవసరమయి, వీటిని మీ వద్ద తాకట్టు పెట్టటానికి తెచ్చాను. నా చదువు నిమిత్తం డబ్బు అప్పు ఇయ్యగలరా?'' అని అడిగాడు.

నగలు చూసి ధనంజయుడి కళ్ళు మెరిశాయి. అన్నీ మేలిమి బంగారు నగలు! ఎంతో కొంత గోపాలుడి చేతిలో పెట్టి, వాటిని కూడా కాజెయ్యవచ్చు నన్న ఆశ కలిగింది ధనంజయుడికి.

''అలాగా, పాపం! చదువు కోసం అంటున్నావు గనక ఎంత కావాలో పట్టుకుపో,'' అన్నాడు ధనంజయుడు అందరి ముందూ తన ఉదారతను చాటుకుంటూ.

"అయిదువందలు ఇయ్యండి, చాలు!" అన్నాడు గోపాలుడు.

ధనంజయుడు వాడికి డబ్బిచ్చి పంపేశాడు.

మర్నాడు అతను అనంతుడి తండ్రినె పిలిపించి, నగల నాణ్యం చూడమన్నాడు.

స్వర్ణకారుడు నగలను పట్టి చూస్తూ, "ఇవి మన జమీందారుగారి నగల్లా ఉన్నాయే! ఇంకా సందేహం దేనికి? అవే! శానా రోజుల క్రితం నేనే తయారు చేసి ఇచ్చాను. నాలుగు రోజుల క్రితం వారింట నగలు పోయాయన్నారు. ఇవే నేమో కొంపతీసి!" అన్నాడు.

ధనంజయుడికి పై ప్రాణాలు పైనే పోయాయి.

"దొంగ సొమ్ము మీ వంటి పెద్దల దగ్గిర ఉండరాదు. దీన్ని మీకు ఎవరిచ్చారో వారికే తిరిగి ఇచ్చి, చేతులు కడిగేసుకోండి. లేకుంటే చిక్కున పడతారు," అన్నాడు అనంతుడి తండ్రి.

అతను వెళ్ళిపోయాక ధనంజయుడు గోపాలుడికి కబురుపెట్టి, "నాకు అవసరంగా డబ్బు కావలసివచ్చింది. నీ నగలు నువు తీసుకుని నా డబ్బు నా కిచ్చెయ్యి. వడ్డీ ఏమీ వద్దులే!" అన్నాడు.

గోపాలుడు నగలు తీసుకుని, "అరె, డబ్బు ఖర్చులకు వాడేశానే! నాలుగు రోజులు ఆగండి, ఇచ్చేస్తాను," అన్నాడు.

ముందు నగలు వదిలితేనే చాలునను కుని, ధనంజయుడు గోపాలుడి మాటకు





సమ్మతించాడు. వారం రోజులుగడిచాయి. ధనంజయుడు పదిమంది పెద్దల మధ్య ఉండగా గోపాలుడు వచ్చి, ''మీ డబ్బు తెచ్చాను. నా నగలు నాకు ఇప్పించండి!'' అన్నాడు.

ధనంజయుడు క్షణంపాటు నిర్ఘాంత పోయి, ''నీ నగలు అప్పుడే ఇచ్చేస్తినిగా? ఎరగనట్టు అడుగుతావేం?'' అన్నాడు.

గోపాలుడు ఆశ్చర్యం నటిస్తూ, ''ఆ నగలు నే నెప్పుడు తీసుకున్నాను? మీ వద్ద డబ్బు తీసుకున్న మర్నాడు నేను బస్తీకి వెళ్ళి, ఇవాళే వస్తున్నాను. నేను ఊళ్ళో కూడా లేనే! అయిదు వేలు ఖరీదు చేసే నగలు! కాజేస్తారా? ఇంతకన్న ఘోరమైన అన్యాయం ఉంటుందా?'' అన్నాడు పెద్దలతో.

ఆ పెద్దలే గోపాలుడికి సాక్ష్యం! తాను గోపాలుడికి డబ్బు ఇచ్చినందుకు ఆ పెద్దలు సాక్ష్యం ఉన్నారు గనక తన డబ్బు ఎక్కడికీ పోదనుకున్నాడుగాని ధనంజయుడు వాళ్ళ సాక్ష్యం తనకు ఎదురవుతుందనుకోలేదు.

పెద్దలందరి ముఖాలూ ధనంజయుడి కేసి తీవ్రంగా చూశాయి.

''ఏమన్న పెద్ద మనిషివయ్యా? ఆ కుర్రాడు నీవద్ద నగలు తాకట్టు పెట్టటం మేం కళ్ళారా చూస్తిమిగా? వాడు బాకీ తీర్చకముందే నగలు తిరిగి ఇచ్చానంటావు, ఎవరన్నా నమ్మే మాటేనా?'' అన్నాడు ఒక పెద్ద.

ధనంజయుడింక ఉండబట్టలేక, ''అవి దొంగనగలు! జమీందారుగారివి! ఈ కుర్రాడు ఎలాగో వాటిని కాజేసి నా దగ్గిర తాకట్టు పెట్టాడు. ఆ విషయం తెలియగానే నేను వాటిని వాడికి తిరిగి ఇచ్చేశాను,'' అన్నాడు.

అందరూ గోపాలుడి కేసి అనుమానంగా చూశారు.

అదేసమయంలో అనంతుడి తండ్రి వచ్చి, ''బాబూ, నగల మజూరీ ఇప్పిస్తారా?'' అని ధనంజయుణ్ణి అడిగాడు.

ధనంజయుడు మండిపడి, "ఏ నగల మజూరీ ?" అని అరిచాడు.

"అలా కోప్పడతారేం, బాబూ ? తమ పాత నగలు కరిగించి కొత్తవి చేసి ఇచ్చానుగదా ! వాటి మజూరీ!" అన్నాడు అనంతుడి తండ్రి.

ఈ మాటలకు ధనంజయుడికి పిచ్చెత్తిపోయింది. జరిగిన మోసం అర్ధమయింది కూడా. కాని ఏం చెయ్యగలడు ? ఈ స్వర్ణకారుడే ఆ నగలు దొంగనగలని భయపెట్టి, గోపాలుడికి తిరిగి ఇప్పించాడని చెబితే, ఎవరు నమ్ముతారు ? స్వర్ణకారుడి మజూరీ ఎగగొట్టటానికి తాను ప్రయత్నం చేస్తున్నాడనుకుంటారు !

గోపాలుడు తాము చూస్తుండగా ఇచ్చిన పాత నగలను స్వర్ణకారుడి చేత కరిగించి, కొత్త నగలు చేయించుకున్నాడని ధనంజయుణ్ణి గురించి అక్కడ చేరిన వారందరికీ నమ్మకం కుదిరింది !

"ఇంతకాలమూ నువు మోతుబరి రైతువనీ, పెద్దమనిషివనీ గౌరవించాం. కాని నువు ఇలాటి మోసాలు చేస్తున్నావనుకోలేదు. ఆ కుర్రాడి నగలు తిరిగి ఇచ్చెయ్యి. వాటిని కరిగించి కొత్త నగలు చేయించినా, చేసిన మనిషి ఇక్కడే ఉన్నాడు గనక, తాను చేసిన నగలేవో చెబుతాడు." అన్నారు పెద్దలు.

ధనంజయుడికి తలకొట్టేసినట్టయింది. తన డబ్బు కక్కుర్తి ఇంతటి తలవంపులు తెస్తుందని అతను ఊహించలేదు. ఇప్పుడు నగలు ఎక్కడినుంచి తెచ్చేటట్టు ?

గోపాలుడికి ధనంజయుడి పరిస్థితి చూసి జాలికలిగింది. అతను అక్కడి పెద్దలతో, "పోనియ్యండి. ఆయన మనసుపడి చేయించుకున్న నగలు నాకు వద్దు. ఆ బంగారం ధర ఇయ్యమనండి. నగలు చేసిన స్వర్ణకారుడు ఇక్కడే ఉన్నాడు గదా, బంగారం ధర ఆయనే చెబుతాడు," అన్నాడు.

ధనంజయుడు గోపాలుడికి రొక్కం అయిదువేలు ఇచ్చి ఋణవిముక్తుడైనాడనిపించుకున్నాడు.

64



# ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 25 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1980 మే నెల సంచికలో ప్రకటింపబడును.







V. Krishna Rao | Bishan Maheshwari

★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.)

★ మార్చి నెల 20-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంతమాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 25/—లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, (వ్యాఖ్యలకు సంబంధించని ఇతర విషయాలేవీ చేర్చరాదు.) ఈ అడ్రసుకు పంపాలి :—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26

## జనవరి నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : గాలిబుడగ జీవితం

రెండవ ఫోటో : పాలబుద్ధితో ప్రారంభం

పంపినవారు : అళ్ళచెర్వు అన్నపూర్ణ, రైల్వేస్టేషన్ రోడ్, గుంతకల్లు.

బహుమతి మొత్తం రు. 25/—ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) 2 & 3, Arcot Road, Madras-600 026 (India). Controlling Editor : NAGI REDDI.

చందమామ పాఠకులు
మరువలేకుండా ఉన్న

# తోకచుక్క
(రంగుల బొమ్మల సీరియల్)

నిన్న చదివిన కథ ఇవాళ జ్ఞాపకం ఉండని వేగపూరితమైన ఈ రోజులలో, 26 ఏళ్ల క్రితం చందమామ 'లో ప్రారంభమైన'' తోకచుక్క '' సీరియల్ కోసం మా పాఠకులు చాలా ఏళ్లుగా మళ్లీ మళ్లీ అడుగుతూ వస్తున్నారు. ఈ పావు శతాబ్ద కాలంలో చందమామ ప్రచారం కాపీల సంఖ్యలోనూ, భాషలలోనూ కూడా ఎంతగానో పెరిగింది.

అందుచేత ఈ సీరియల్‌ను 1980 మే సంచిక నుంచి తిరిగి ప్రచురిస్తున్నాము.

ఇంకొక విశేషమేమంటే దీని వెంట ఉండే చిత్రాలు స్వర్గీయ చిత్రావి!

CHITRA

**Statement about ownership of CHANDAMAMA (Telugu)**
**Rule 8 (Form VI), Newspapers (Central) Rules, 1956**

| | | | |
|---|---|---|---|
| 1. | *Place of Publication* | ... | 'CHANDAMAMA BUILDINGS'<br>188, Arcot Road<br>Vadapalani, Madras-600 026 |
| 2. | *Periodicity of Publication* | ... | MONTHLY<br>1st of each calendar month |
| 3. | *Printer's Name* | ... | B. V. REDDI |
| | *Nationality* | ... | INDIAN |
| | *Address* | ... | Prasad Process Pvt Limited<br>188, Arcot Road, Vadapalani<br>Madras-600 026 |
| 4. | *Publisher's Name* | ... | B. VISWANATHA REDDI |
| | *Nationality* | ... | INDIAN |
| | *Address* | ... | Chandamama Publications<br>188, Arcot Road, Vadapalani<br>Madras-600 026 |
| 5. | *Editor's Name* | ... | NAGI REDDI |
| | *Nationality* | ... | INDIAN |
| | *Address* | ... | 'Chandamama Buildings'<br>188, Arcot Road, Vadapalani<br>Madras-600 026 |
| 6. | *Name & Address of individuals who own the paper* | ... | CHANDAMAMA CHILDREN'S TRUST FUND<br>Beneficieries:<br>1. B. V. HARISH<br>2. B. V. NARESH<br>3. B. V. L. ARATI<br>4. B. L. NIRUPAMA<br>5. B. V. SANJAY<br>6. B. V. SHARATH<br>7. B. L. SUNANDA<br>8. B. N. RAJESH<br>9. B. ARCHANA<br>10. B. N. V. VISHNU PRASAD<br>11. B. L. ARADHANA<br>12. B. NAGI REDDI |

All Minors—by Trustee:
M. UTTAMA REDDI, 9/3, V.O.C. Street, Madras-600 024

I, B. Viswanatha Reddi, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

*1st March* 1980

**B. VISWANATHA REDDI**
*Signature of the Publisher*